*Issued*: 15-3-55.




# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

## WEDNESDAY, 17TH MARCH 1954

## VOLUME V, No. 6

*CONTENTS*



PRINTED FOR ANDHRA GOVERNMENT PRESS
BY SRI RAMA PRINTING WORKS, NELLORE

1955

PRICE 6 annas

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

Wednesday, the 17th March 1954.

The House met in the Assembly Hall, Kurnool, at half past eight of the clock, Mr. Speaker (The Hon. Sri N. Venkataramaiya) in the Chair.

## QUESTIONS AND ANSWERS

### STARRED QUESTIONS.

Mr. SPEAKER:—Question Nos. 321 and 322 will be taken up next week as the Hon. Chief Minister and the Hon. Deputy Chief Minister are absent.

Sri T. NAGI REDDI:—Also, Sir, one question was not answered on the previous day.

Mr. SPEAKER:—That also will be taken up.

*Hereditary right of succession to Village Officers.*

* 323. Q:—SRI G. SIVASANKARA REDDI:— Will the Hon. the Minister for Land Revenue be pleased to state whether there is any proposal to amend the Act of hereditary Village Officers in order to abolish the hereditary right of succession to the village officers?

The Hon. Sri K. KOTI REDDI:—The answer is in the negative.

Sri T. LAKSHMINARAYANA REDDI:- ఈ గ్రామోద్యోగులు న్యాయంగా ఉద్యోగం నిర్వహించవలసివస్తే ఎక్కువ జీతాలు ఇవ్వవలసి వస్తుంది. కాబట్టి N. G. O. ల మాదిరిగా వారికి ఎక్కువ జీతాలు ఇవ్వడానికి ప్రభుత్వాలోచనలో ఉందా?

The Hon. Sri K. KOTI REDDI:—మీరు వేసిన ప్రశ్నకు దీనికి ఏమీ సంబంధంలేదను కుంటాను. Hereditary system abolish చేస్తారా అన్నదానికి మీరు జీతాలసంగతి అడిగితే ఎట్లా?

Sri G. SIVASANKARA REDDI:-Are the Government aware of the fact that the hereditary village officers have become not only dictatorial but have also become a nuisance to the villagers and ryots (Sri T. Nagi Reddi: hear, hear) and hence will the Government think of abolishing the hereditary right ?

The Hon. Sri K. KOTI REDDI.—Government are aware that the village munsif has become a nuisance.

Sri C. SUBBARAYUDU:-ఇంతకు ముందునుంచికూడా ఈ బాధలు పడుతున్నాం. కొన్నిచోట్ల 100 జనసంఖ్యగల గ్రామాలకుకూడా ఒక రెడ్డి కరణం ఉన్నారు. అలాకాకుండా 3, 4 గ్రామాలకు కలిపి ఒకరెడ్డి కరణం ఉంటే ఖర్చుకూడా తగ్గుతుంది. దీని విషయంలో ప్రభుత్వం ఆలోచన చేస్తుందా?

The Hon. Sri K. KOTI REDDI:—ఈ question చాలా సంవత్సరాలుగా ఉంది. ఈ hereditary system తీసివేయాలని కొంత మంది,కొంతమందిఉంచాలని చెప్పుతున్నారు ఇదిఉండాలని రెవెన్యూబోర్డు గవర్నమెంట్‌కూడ తీర్మానంచేశారు. ఈ system ను ఇప్పుడు తీసి వేయడం సాధ్యంకాదని మాత్రం నా నమ్మకం. ఈ hereditary system వల్ల కొన్ని disadvantages ఉన్నాయని నేనుకూడా ఒప్పుకుంటాను. హెచ్చు చదువుకొన్న వాళ్లు యీ ఉద్యోగాలకు రావాలని అంటే ఇప్పుడు ఇచ్చే జీతాలు చాలవు. సామాన్యంగా విలేజి ఆఫీసర్లు చేయవలసిన పనికి B. A లు అవసరంలేదు. ఈ విలేజి ఆఫీసర్లుకుకూడా స్పెషల్ టెస్టుఉంది. వాళ్ళుచేసేపనులకు వాళ్ళు చదివిన చదువు సామాన్యంగా చాలును. ప్రస్తుత పరిస్థితులలో ఉన్నటువంటి village ఆఫీసర్లులోకూడా చాలామంది మెట్రిక్యులేట్సు, B. A లు కూడా ఉన్నారు. నాకు తెలిసినంతవరకు ఒక రిటైర్డు తహసీల్ దారుకూడ village officer క్రింద పనిచేస్తున్నారు. కొంతవరకు పలుకుబడి మర్యాద సంపాదించడంవల్ల పనులు జాగ్రత్తగా జరుగుతాయి కూడా. అయితే శ్రీ చల్లా సుబ్బరాయుడుగారు కొన్ని గ్రామాలను గ్రూపుగాచేసి హెచ్చుగా చదువుకొన్న వాళ్ళను పెట్టరాదా అని అడిగారు. 1923 వ సంవత్సరంలో ఇలా చేయడం జరిగింది. కాని

సాధ్యంకాదని చెప్పారు. అందుచేత మనం ఇచ్చే జీతాలనుబట్టి మన ఆర్థిక పరిస్థితులనుబట్టి ఈ hereditary system ఉంటేనే బాగుంటుం దని గవర్నమెంటు నమ్మకం.

Sri K. VARADACHARI:- ఇది చాలా ముఖ్యమైన విషయ మని మంత్రిగారే చెప్పారు. ఈ సందర్భంలో సాయంత్రం ఒక half an hour debate ఇస్తే బాగుంటుంది.

Mr. SPEAKER:—All this was anticipated by the Minister and that is why all possible supplementary questions he has answered in his previous reply. (Laughter)

*Granting of 'Independence Day and Republic Day' as Holidays for employees.*

* 324 Q.—Sri K. GOVINDA RAO:—(Put by Sri T. Nagi Reddi :— Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state:

(*a*) whether 'Independence Day' and the 'Republic Day' are granted as holidays for employees in the various industrial establishments in our State: and

(*b*) if so, whether it is in lieu of the original 10 days that the workers are entitled to ?

The Hon. Sri D. SANJIVAYYA :—

(*a*) The employers in Industrial undertakings are not bound by law to declare the Republic Day and Independence Day as holidays for the workers working under them. The Government however appeal to managements every year to declare these two national holidays as additional paid holidays for their workers to enable them to participate in the celebrations without loss of wages.

(*b*) They are treated as additional paid holidays and not as substituted holidays.

రిపబ్లిక్ డేగాని, ఇండిపెండెన్సుడేగాని శలవుదినాలుగా పరిగణించాలనేది ఇండస్ట్రియల్ ఎంప్లాయర్సును నిర్బంధించదు. కాని ఈ రెండు దినాలలోను శలవు యివ్వాలనీ, ఆ రోజుల్లో వాళ్ళకు జీతంయివ్వాలని, వారు అదివరకు యిచ్చే 10 దినాలుగాక వీటిని అదనంగానే యివ్వాలని ఇండస్ట్రియల్ ఎంప్లాయర్సుకు ప్రభుత్వం అపీలుచేసింది.

Sri M. VEERABHADRAM:— ప్రభుత్వ విజ్ఞాపన ననుసరించి దీనిని అమలుపరచని ఫాక్టరీలున్నాయాండి?

The Hon. Sri D. SANJIVAYYA:— ఉండవచ్చు. కాని అటువంటి సందర్భాలు నా నోటీసుకు రాలేదు. వస్తే వాటినిగురించి విచారించి తగిన చర్యలను తీసుకుంటాము.

Sri P. PUNDARIKAKSHACHARYULU:— ఈ మోస్తరుగా ఫ్యాక్టరీ యజమానులకు అపీలు చేసేబదులు, ఈ రెండు రోజులనుకూడా Negotiable Instruments Act క్రింద వచ్చే శలవు దినాలలో కలపడానికి ప్రయత్నించరాదా?

The Hon. Sri D. SANJIVAYYA:— ఈ రెండు రోజులు కూడా శలవుదినాలుగా treat చెయ్యడానికి గత రెండు సంవత్సరాలుగా ఆలోచనలోవుంది. 1953 సం॥రం జూన్ నెలలో Indian Standing Labour Committee కలుసుకుని ఈ విషయాన్ని ఆలోచించారు. కొన్ని రాష్ట్రాలలో 10 రోజులు శలవు యిస్తున్నారు. మరికొన్ని రాష్ట్రాలలో తక్కువగా యిస్తున్నారు. అస్సాంలో 3 రోజులు మాత్రమే యిస్తున్నారు. పై కమిటీవారు అన్ని రాష్ట్రాలకు సమానంగా 10 రోజులుగాని, 15 రోజులుగాని యిచ్చే సమస్యనుగురించి మాట్లాడారు. తుదకు ఏ అగ్రిమెంటు లేకుండా ఆ మీటింగు పూర్తయింది. తిరిగి ఇంకోసారి కలుసుకొని దీనిని గురించి నిర్ణయించవచ్చు.

Sri S. VEMIAH:— Private Management క్రింద ఉన్న స్కూళ్ళలో శలవులు యివ్వకుండానే నడుపుతున్నారు. వారికి కూడా శలవులు తప్పకుండా యివ్వాలని ఉత్తర్వులు జారీచేస్తారా?

The Hon. Sri D. SANJIVAYYA:— ఈ స్కూళ్ళు దీని క్రిందకి వస్తాయో రావో తెలియదు. ఒకవేళ వస్తేమాత్రం వాటికి కూడా ఈ rules వర్తించేటట్లు చూస్తాము.

Sri M. VEERABHADRAM:— ప్రభుత్వ అధీనంలో పని చేసే పరిశ్రమలలో కూడా, ముఖ్యంగా మాంచ్ ఖండ్ ప్రాంతంలో ఈ శలవుదినాలు పరిగణించడం లేదన్న సంగతి ప్రభుత్వానికి తెలుసా ?

The Hon. Sri D. SANJIVAYYA:— అది నాకు తెలియదు. ఈ రెండు దినాలు శలవుదినాలుగా పరిగణించాలని అన్ని private employers ను అడిగాము. ఇది ఇవ్వాలని ఆదర్శప్రాయంగా ఉన్నవాళ్ళు తప్పకయిస్తారు.

*New Elementary Education Scheme.*

*325 Q.-Sri VAVILALA GOPALAKRISHNAIAH:- Will the Hon. the Minister for Education and Industries be pleased to state:

(a) the Government's decision regarding the discontinuance of the New Elementary Education (Scheme);

(b) Whether the Government have received a copy of the report of the Sub-committee appointed by the Madras Government;

(c) the number that are likely to be thrown out of employment this year or next year consequent on the implementation of the new scheme;

(d) the number of teachers that are drawing the special pay fixed for working five hours a day;

(e) whether the Government are paying over-time pay; and

(f) If so, how much, and if not, why not ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:—

(a) A committee known as "The Elementary Education Committee" has been constituted to go into

the whole question of Elementary Education and to report shortly. The Government will take a decision after the receipt of the Committee's report.

(*b*) Yes.

(*c*) Nil.

(*d*) No Special pay has been fixed for the teachers for working 5 hours a day.

(*e*) No.

(*f*) In view of the slender financial position of the State Government, they are not paying overtime pay to the teachers.

(1) ఈ మధ్య ప్రభుత్వం ఎలిమెంటరీ ఎడ్యుకేషన్ కమిటీ అనే ఒక కమిటీనివేసింది. వారిని రిపోర్టు తయారు చెయ్యమన్నాము. ఆ రిపోర్టు కొద్ది నెలలలోనే వస్తుందని ఆశిస్తున్నాను. ఆ రిపోర్టు వచ్చిన తర్వాత ప్రభుత్వం ఒక నిర్ణయానికి వస్తుంది.

(2) అవును.

(3) లేదు.

(4) ప్రత్యేకంగా 5 గంటలు పనిచేస్తున్న ఉపాధ్యాయులకు ప్రత్యేకమైన అదనపు జీతం యివ్వడంలేదు.

(5) లేదు.

Sri C. V. K. RAO :— ఈ కమిటీకి అధ్యక్షులుగా ఉండడానికి వీలులేదని వారు తెలియపర్చినట్లు ప్రకటన వెలువడింది. ఎందు చేత వారట్లు చెప్పవలసివచ్చింది ? కమిటీ నిర్ణయం చెయ్యవలసిన విషయాల సందర్భమై వారికి ప్రత్యేకమైన సూచనలేమైనా ప్రభుత్వం యిచ్చిందా ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO :— అధ్యక్షులవారికి ప్రత్యేకమైన సూచనలేవీ యివ్వలేదు. తక్కిన సభ్యుల కిచ్చిన సూచనలే వారికీ యిచ్చాము. ఇక అధ్యక్షులుగా ఉండడానికి ఎందుకు నిరాకరించారో మీరు వారినే అడగండి. మేమేమీ చెప్పలేము.

Sri VAVILALA GOPALAKRISHNAIAH :— ఇప్పుడు ఉపాధ్యాయులను తగ్గించడానికి క్రింది తరగతులలో సంవత్సర ప్రారంభంలో మార్పులువస్తే, ఉపాధ్యాయులు ఎక్కువగావున్న సందర్భాలుంటే తగ్గిస్తామని జిల్లా బోర్డులు, డెప్యూటీ ఇన్‌స్పెక్టర్లు నోటీసు లిస్తున్నారు. ఒక స్కీము పూర్తికాక పూర్వమే ఉపాధ్యాయులను తగ్గించడం వుండదని క్రిందటి బులెటిన్‌లోవుంది. ఇటువంటివి జరగడంవల్ల ఉపాధ్యాయులకు చాలా అసౌకర్యాలు జరుగుతాయి. అటువంటివి జరగకుండా చూస్తూ, ఈ సంవత్సరం గ్రాంట్లు వారికే మంజూరుచేస్తారా? అంతేగాక అదనంగా పనిచేసేవాళ్ళకు overtime అలవెన్సులు యివ్వడానికి ఏర్పాటు చేస్తారా ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO :— వీరి ప్రశ్న 2 భాగాలుగా వుంది. మొదటి భాగానికి సమాధానం. కేవలం యీ స్కీములవల్ల రిట్రెంచిమెంటు రాదు. రెండవ భాగానికి హెచ్చు అలవెన్సులు యివ్వడం విషయంలో ఆర్థికశాఖ, విద్యాశాఖలు సమగ్రంగా పరిశీలన చేస్తేనేగాని యిదమిత్థంగా ఏమీ చెయ్యడానికి సావకాశం లేదు.

Sri P. RANGA REDDI:-ఇదివరకు నియమించిన అధ్యక్షులు, ఇకమీదట అధ్యక్షులుగా ఉండడానికి ఫలానా కారణాలవల్ల, నిరాకరిస్తున్నామని వ్రాశారా? వ్రాస్తే ఏమిటా కారణాలు? తరువాత ఇంకొక అధ్యక్షునికోసం అన్వేషణ జరుపుతున్నారా? అన్వేషణ ఎంతవరకు సాగిందో తెలియజేస్తారా ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:— అధ్యక్షా! ఆ అధ్యక్షులు ఉత్తరంద్వారా నిరాకరించారు. వారు చాలా దూరంగా ఉండడంవల్ల, అక్కడ వారికేదో పని ఉండడంవల్ల, ఆ పనిలో వారు నిమగ్నులై ఉన్నందువల్ల, ఇక్కడ ఈ అధ్యక్షపదవిని నిర్వహించజాలనని వ్రాశారు. వారు ఈ విధంగా పదవికి రాజీనామా చేశారు. నాకు తెలిసినంతవరకు ఇదితప్ప వేరే కారణం ఏమీలేదు. తరువాత ఒకర్ని కాదు, ముగ్గురని అన్వేషించడం జరిగింది. వారిని అధ్యక్షపదవికి ఆహ్వానించడం జరిగింది. అందులో ఒకరు వయోభారం

వల్ల ఈ పనిని నిర్వహించలేనని ఉత్తరంద్వారా తెలియజేశారు. రెండవ వారు ఏమీ కారణములు చెప్పకుండానే నిరాకరించారు. మూడవ వారుకూడా కారణం చెప్పకుండానే నిరాకరించారు. ఇంకొకర్నికూడా ఆహ్వానించాము. వారివద్దనుంచి ఇంకా ఏమీ ఉత్తరంరాలేదు. బహుశా ఆయన ఒప్పుకోవచ్చు. ఆయన దగ్గరనుంచి అంగీకారపత్రం 2, 3 రోజులలోవస్తే మీకు ఇక్కడ తెలియజేస్తాను.

Sri G. NAGESWARA RAO:—అధ్యక్షా! ఇపుడు మంత్రిగారు చెప్తూ ఈ స్కీము ఫలితంగా ఉపాధ్యాయు లెవ్వరిని తగ్గించ లేదని చెప్తున్నారు. కాని కొద్దికాలంక్రితం పిఠాపురం తాలూకాలో 3 గ్గురు ఉపాధ్యాయులను తీసివేసిన సంగతి గౌరవనీయ మంత్రిగారికి తెలుసునా?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:— ఏ ఇతర కారణాలవల్ల వారిని తీసివేయడం జరిగిందో కాని, ఈ స్కీము వల్ల మాత్రం కాదని పునరుద్ఘాటిస్తున్నాకదా.

Sri M. KUNE RAO:— అధ్యక్షా, ఈ committee కి అధ్యక్షులుగా ఉండడానికి, ఒకరు, ఇద్దరు, ముగ్గురు, నలుగురుచుకూడా రమ్మనడం, వారు నిరాకరించడం జరిగిందన్నారు. దానికి కారణం, లోగడ రామమూర్తిగారి కమిటీకి పట్టినగతే ఈ కమిటీకికూడా పడుతుం దనే భయంవల్ల కావచ్చునేమో?

The Hon. Sri S. B. P. PATTBHIRAMA RAO:— రామమూర్తి కమిటీకి పట్టినగతేమీలేదు. ఆ కమిటీ నివేదికను సమర్పిం చింది. దానిని ప్రభుత్వం ఆచరణలో పెట్టిందా, లేదా అనే సంగతి వేరు. అంతేకాని, ఆ కమిటీ సక్రమంగా పనిచేసి నివేదికను సమర్పించింది. ఆ రామమూర్తి కమిటీకి ఏగతీ పట్టలేదు. కాని సభ్యుల విమర్శనమాత్రం దానిని గురించి ఎక్కువగా వచ్చింది.

Sri K. SUBBA REDDI:— ఈ నూతన విద్యావిధానం వచ్చిన తరువాత schoolless centers లో schools పెట్టడానికి అనేక కారణములు చెప్తున్నారు. ఒకవేళ ఎవరైనా ఆ ప్రాంతములలో

school పెడితే దానికి recognition యివ్వడంలేదు. ఇకనైనా schoolless centers లో schools ను వెంటనే స్థాపించటం, లేక పోతే ఆ ప్రాంతంలోని schools ను recognise చేయడంగాని, చేస్తారా? అందుకు ప్రభుత్వం, గౌరవనీయ మంత్రిగారు, ప్రయత్నం చేస్తారా?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:— నూతన ప్రాథమిక విద్యావిధానానికి ఈ schoolless centers లో కొత్తగాపెట్టిన schools ను రికగ్నైజు చేయడానికి ఏమీ సంబంధం లేదని అనుకుంటాను. వాటికిగల సంబంధం ఏమిటో నాకు తెలియడం లేదు. తగిన సౌకర్యములున్నచోట, అవసరమున్నచోట క్రొత్త పాఠ శాలలకు రికగ్నిషన్ తప్పకుండా యివ్వబడుతుంది.

Sri G. SIVASANKARA REDDI:— ప్రభుత్వంవారు ఈ కమిటీవారికి ఏవో సూచనలు చేశామని చెప్పారు. ఆ సూచనలను ఆచ రణలో పెట్టుటకు ఇష్టంలేక అధ్యక్షులు అధ్యక్షపదవికి రాజీనామా ఇచ్చారా?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:— ఆ సూచనలేమిటంటే మీరు అంతా సమగ్రంగా పరిశీలించండి అని మాత్రమేగాని, ఇదమిద్ధంగా ఆ సూచనలను ఇవ్వలేదు. ప్రత్యేకించి అధ్యక్షుని కివ్వలేదు. ఇతర సభ్యులంతా ఏకగ్రీవంగా ఆమోదించిన సూచనలే అవి. ఇలాంటివి శివశంకరరెడ్డిగారు జాగ్రత్తగా పరిశీలిస్తారు. కాని ఆయన ప్రశ్నలుమాత్రం యక్షప్రశ్నలలాగ వుంటాయి.

Sri P. GUNNAYYA:— అధ్యక్షా! ఉపాధ్యాయులకు జీతాలు హెచ్చుచేయడానికి వీలులేదని గౌరవనీయ మంత్రిగారు సెల విచ్చారు. జీతాలు వారికి తక్కువగా ఉన్నాయి. Aided ఉపా ధ్యాయులు, మానేజర్లుద్వారా జీతం తీసుకోవలసివుంది. వారికివచ్చే 40 రూపాయల జీతంలో 10 రూపాయలు మామూలుగా మానేజరులు తీసుకుంటున్నారు. ప్రభుత్వమునకు తెలియకుండా మానేజర్లు తీసు కుంటున్నారు. అందుచేత మానేజర్లుద్వారా గాక, ఆ ఉపాధ్యాయు లకే డైరెక్టుగా జీతాలు పంపటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందా?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:— గౌరవనీయ సభ్యులైన గున్నయ్యగారు చెప్పినవిషయమై మేము యిది వరకునుంచీ కూడా ఆలోచనలో ఉన్నాము. ఈ Managements అనేవి కొన్నిచోట్ల జమీందారీలలాగా తయారయ్యాయి. ఈ Managements నే రద్దుచేసి, ఉపాధ్యాయవర్గానికి సౌకర్యములు కలిగించవలె ననే విషయం ఆలోచనలో ఉన్నది. ఉపాధ్యాయులకు అలాంటి అన్ని సౌకర్యములు ఏర్పాటు చేస్తామని చెప్తున్నాను.

Sri M. R. APPA RAO :— ఈ సమాధానం వినకముందు ప్రశ్న అడుగుదామనుకున్నాను. కాని యీ సమాధానం నాకు తృప్తి కరంగానే ఉన్నది. ఇంక ప్రశ్న అడగనవసరం లేదు.

Sri P. VENKATASUBBAIAH :— 3, 4 గురిని ఆహ్వా నించినా ఎవరూ యీ కమిటీ అధ్యక్షపదవికి రాలేదని చెప్పారు, దానికి కారణం బహుశా వారికి గౌరవవేతనము సంపూర్ణంగా ఉండకనా నిరాకరించారు?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:— అసలు వారికి జీతమే లేనపుడు, ఇంక సంపూర్ణమనే question ఎలా వస్తుందండీ ?

Sri G. BAPANAYYA :— ఇపుడు ఉపాధ్యాయులను యీ నూతన విద్యావిధానం స్కీముక్రింద తీసివేయడం లేదన్నారు. ఈ మధ్య కృష్ణా జిల్లాలో 40 మంది ఉపాధ్యాయులను తీసివేసిన సంగతి, అచట ఎటువంటి పరిస్థితి ఏర్పడిందో ప్రభుత్వానికి తెలుసా ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:— వారిని తీసివేయడానికి అనేక కారణాలు ఉండవచ్చు. దీని విషయమై మీరు ప్రత్యేక ప్రశ్నవేస్తే, Information తెప్పించి చెప్తాను. ఏ యితర కారణములవల్లనో తీసేశారేమోకాని, దీనివల్లమాత్రం తీసి వేయలేదని నేను మళ్ళీ చెప్తున్నాను. దీనిని ఒక ప్రత్యేక ప్రశ్నగా వేయండి.

Sri T. NAGI REDDI:— ఈ నూతన విద్యావిధానం ప్రకారం యింతకు ముందున్న స్కూల్సులో విద్యార్థులు ఎక్కువగాను ఆ సంఖ్య యధాప్రకారముగా వుంటే యీ నూతన విద్యావిధానముకు యిప్పుడున్నంత teachers అవసరం వుండదు. ఈ నూతన విద్యావిధానములో యిప్పుడు ఉన్నంతపనికి, యింతమంది teachers అవసరం వుండదు అని ఒక ఖచ్చితమైన అభిప్రాయం వుంటూంది. ఒక స్కూలు లో 30 మంది విద్యార్థులుకనుక వుంటే, యీ విద్యావిధానం ప్రకారం 15 మంది సాయంత్రం, 15 మంది ఉదయం స్కూలుకువస్తే, యింక ఆ స్కూలులోవున్న 3 గురు teachers కు పని తగ్గిపోతుంది. ఆ కారణం చేత వారిని ఆ ఉద్యోగంనుంచి తీసివేయడం జరుగుతోంది. ఈ నూతన విద్యావిధానంవల్ల teachers ను పనిలోనుంచి తీసివేయకుండా ప్రభుత్వం చేస్తారని మంత్రిగారు హామీ యిస్తారా ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:— ఈ కారణాలవల్ల teachers ను తీసివేయడం జరగదు ; అక్కడ కాకపోతే, ఇంకొకచోట వారికి పనియిచ్చేటట్లు చూస్తాము. మొత్తం మీాద వారిని యీ స్కీమువల్ల పనినుండి తొలగించడం జరగదు అని హామీాయిస్తున్నాను. ఈ విషయం యింతకుముందే మనవిచేశాను. అయినా యిటువంటి విషయాలనుగురించి ప్రత్యేకమైన ప్రశ్న వేస్తే సమాచారం అంతా ముందుగా తెప్పించి చెప్పేవాడిని.

Sri T. NAGI REDDI:— ఈ New Education Scheme వలన ఉపాధ్యాయులను పనిలోనుంచి తొలగించమని చెప్పారు. నేను అడిగిన ప్రశ్న అదికాదు. వారిని యీ పనిలోనుంచి తీసేసి యింకొకపని యిస్తారా అని కాదు. ఈ నూతన విద్యావిధానంవల్ల కొంతమంది ఉపాధ్యాయులకు ఉద్యోగాలు పోతాయా, పోవాలన్నదే నా ప్రశ్న.

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:— ఈ విద్యావిధానంవల్ల, ఉపాధ్యాయులను పనిలోంచి తీసివేయడం జరగదు. అసలు యీ విద్యావిధానం వుంటుందో, వుండదో చెప్పలేము. ఇకముందుకూడా ఈ విధ్యావిధానం అమలులో ఉంటుందని ప్రతిపక్షనాయకులు ఊహిస్తున్నట్టున్నారు. ఈ నూతన విద్యావిధానం విషయమై

పరిశీలించడానికి నియమించబడిన కమిటీయొక్క సిఫార్సులనుబట్టి, యీ స్కీముకు అమలుపరచడమో, తీసివేయడమో జరుగుతుంది. ఒక వేళ ఈ కమిటీ సిఫార్సుల ప్రకారం ఈ ప్రాథమిక నూతన విద్యా విధానం అమలుజరిగినా కాని, ఉపాధ్యాయులను తొలగించమని హామీ యిస్తున్నాను. ఒకచోట అవసరం లేకపోయినా, ఇంకొకచోటనైనా వారికి ఉద్యోగములు యిస్తాము అని హామీ యిస్తున్నాను. కొన్ని చోట్ల విద్యార్థులు లేకపోయినాకూడా అచట ఉపాధ్యాయులు ఉండాలని ప్రతిపక్ష నాయకుల అభిప్రాయం. అసలు ఈ స్కీము ఉంటుందో, ఉండదోకూడా తెలియదు. ఇంకా ఈ స్కీము అమలు జరుపబడుతుం దనే ఉద్దేశంతోనే ప్రతిపక్షనాయకులు వున్నారనుకుంటాను. ఉదాహరణకు 50 మంది విద్యార్థులున్నచోట, 20 మంది విద్యార్థులవరకు తగ్గిపోతే, అక్కడకూడా ఉపాధ్యాయులు ఎక్కువమంది వుండాలా? అసలు తగ్గించకూడదనా?

Sri T. NAGI REDDI:—నేను అడిగిన ప్రశ్న direct గా వుంటే, 50 మంది విద్యార్థులు వున్నచోట 20 మందికి తగ్గితే, ఉపాధ్యాయులను తగ్గించకుండా వుండాలని నాగిరెడ్డిగారి వుద్దేశ్యమా అని ప్రశ్న తిరిగి నాకే వేయడం నన్ను misrepresent చేయడం అవుతుంది. నేను అడిగిన ప్రశ్న తిరిగి చెబుతున్నాను. ముప్పైమంది విద్యార్థులు వున్నచోట, ముగ్గురు ఉపాధ్యాయులు వుంటే, ప్రొద్దున్న 15 గురు సాయంత్రం 15 గురు విద్యార్థులు వున్ననాడు, ఉపాధ్యాయులును తొలగించాలి అని ప్రభుత్వం ఆశిస్తోందా? ఆ విధంగా తొలగించము అని ప్రభుత్వం హామీ ఇస్తుందా?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:—అధ్యక్షా, ఒక విషయం మీ దృష్టికి తీసుకురావలసి యున్నది. ప్రశ్నకు జవాబు పూర్తికాకుండానే, ప్రతిపక్షనాయకులు interrupt చేయడం, మళ్ళీ ప్రశ్నను వ్యాసరూపంలో చెబితే, నేను జవాబు ఎలా చెబుతాను? ఈ సంప్రదాయం మంచిది కాదని మనవిచేస్తున్నాను.

Sri T. NAGI REDDI:—On a point of order. నేను ఎందుకు చెప్పవలసి వచ్చింది అంటే, direct గా వున్న నా ప్రశ్నకు

సమాధానం చెప్పకుండా నాకే ఎదురు ప్రశ్న వేశారు. కాబట్టి మీరు పూర్తిగా చెపితే direction of అవుతుంది. 50 మంది విద్యార్థులు ఉన్న చోట 20 మంది తగ్గితే, ఉపాధ్యాయులను తగ్గించవచ్చా అనే జవాబు ఇవ్వడానికి వీలుగా నేను ప్రశ్న వేయలేదు. ఈ వంటి ప్రశ్నను నాకు వేయటం అసలు విషయాన్ని మభ్యపెట్టడమే అవుతుంది. నేను ఒకవిధంగా ప్రశ్న వేసినప్పుడు మరొకవిధంగా జవాబు చెప్పి distort చేయడానికి ప్రభుత్వానికి అధికారం ఉన్నదా అని అడుగుతున్నాను. దానిమీద జవాబు చెప్పవలసివస్తే, ప్రతిపక్షనాయకులు ఘోరంగా చెబుతున్నారనుకోకుండా ఉంటే, battle of wits మీకేకాదు, మాకు కూడా తెలుసు అని విజ్ఞప్తి చేస్తున్నాను.

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:—ఘోరమేకాదు. ఘోరాతి ఘోరం. నేను చెప్పేది పూర్తికాకుండానే లేచి. నా ప్రశ్నకు జవాబుసరిగ్గా చెప్పలేదుఅన్నారు. నేను కూర్చునేపరిస్థితి ఏర్పరిచారు. Wits అనేవి వున్నాయిఅని అందరికీ తెలుసు. అయితే ఇతరులు wits ఉపయోగించినప్పుడు tolerance అలవాటు చేసుకోమని ప్రతిపక్ష నాయకులను కోరుతున్నాను.

Sri T. NAGI REDDI:—మీరు ఉపయోగిస్తే నేను ఉపయోగించదలుచుకున్నాను. ఇంతకీ నా ప్రశ్నకు జవాబుచెప్పలేదు.

The Hon Sri S. B. P. PATTABHIRAMA RAO:—నేను అర్థం విడదీసి చెబుతాను. ఈ స్కీము అమల్లో వున్నప్పుడు తగినంతమంది విద్యార్థులు లేనప్పుడు ఉపాధ్యాయులసంఖ్య జాస్తిగా వున్నప్పుడు తగ్గించక తప్పదు. ఒక వేళ అక్కడ తగ్గించినా, వారు ఉపాధ్యాయ వృత్తిలోనుంచి పోకుండా, నిరుద్యోగం లేకుండాచూస్తాము. మరొక చోటికి వారిని పంపిస్తాము. విద్యార్థుల సంఖ్య ఒకచోట తగ్గితే, మరొకచోట జాస్తిగా వుంటుంది. ఇంతకీ ఈ స్కీము వుండేది, లేనిది, తెలియదు. దానిని గురించి ఇంత యుద్ధం అవసరంలేదు. ఒకచోట తగ్గితేమరొకచోట హెచ్చుగాఉంటారు. వారినిఉపాధ్యాయవృత్తిలోనుంచి పోకుండా చూస్తాము అన్నాను. ఇంతకన్న ప్రతిపక్షనాయకులకు హామీ ఏమి కావాలి?

Sri VAVILALA GOPALAKRISHNAIAH :—నేను ఒక ప్రశ్న అడిగాను. వారు జవాబు చెప్పలేదు. అది చాలా ప్రధానమైనది. ఈ ప్రశ్న మొదటవేసిన కారణం చెప్పారు. పూర్తిగా అవగతం కాలేదు అని చెబుతున్నారు. నాప్రశ్న ఉద్దేశ్యమే పోతుంది కాబట్టి—

Mr. SPEAKER:—మరొక ప్రశ్న వేయండి.

*Hostel for Scheduled Caste People.*

* 327 Q:—SRI T. LAKSHMINARAYANA REDDI Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state whether the Government have any proposal to start many Government hostels in Rayalaseema for scheduled caste people?

The Hon. Sri D. SANJIVAYYA:—No, Sir.

Sri T. LAKSHMINARAYANA REDDI:— రాయల సీమలో వుండే హాస్టల్సు సంఖ్య చాలా తక్కువగా వున్నది. హరిజనాభివృద్ధి గురించి చెబుతుండే ప్రభుత్వం వెనుకబడిన రాయలసీమ ప్రాంతంలో హరిజన హాస్టల్సు ఎక్కువగాపెట్టే ఆలోచన చేస్తారా?

The Hon. Sri D. SANJIVAYYA: ప్రభుత్వం హరిజనుల అభివృద్ధికి పాటుపడుతుంది. అనేకచోట్ల హాస్టల్సు పెడుతున్నారంటే, వాటిని అన్నింటిని గవర్నమెంటు నడపడంలేదు. వీటిలో నూటికి 99 పాళ్ళు ఉదార స్వభావులైనవారు నడుపుతున్నారు. హరిజనోద్ధరణకు పాటుపడుతున్నారు. వారికి కొంతధనం ప్రభుత్వం ఇస్తోంది. అందులో వుండే బాలురకు బాలికలకు తగినంతధనం ఇవ్వడంలేదు. అదేవిధంగా ఇక్కడకూడా హాస్టల్సు ప్రారంభించేస్తే సహాయం చేస్తాము. మేము ఇచ్చేదానివల్లనే వాటిని నడిపించాలంటే అది చాలదు. కొంత ఇస్తాము. Half loaf is better than no bread.

Sri T. N. VENKATASUBBA REDDI:— లక్ష్మీనారాయణరెడ్డిగారి ప్రశ్న ఉద్దేశం అది కాదనుకుంటాను. హాస్టల్లో విద్యార్థుల సంఖ్య 10 . ఎక్కువకావాలి అని G. O. వున్నది. వెనుకబడిన

ప్రాంతాల్లో అది సరిగ్గా అమలు జరగడానికి కష్టంకాబట్టి దానిని మార్చుడానికి ప్రయత్నం చేస్తారా?

The Hon. D. SANJIVAYYA:—G. O.లు చాలావున్నాయి. హాస్టల్సు ప్రారంభించేవారు మొదటిసంవత్సరం స్వంతబాధ్యతమీద నడపాలి అని వున్నది. కాని వెనుకబడిన ప్రాంతాల్లో హాస్టల్సు ప్రారంభించినపుడు దానినుంచి మినహాయింపుచేసి సహాయం చేయుడానికే ప్రయత్నం చేస్తున్నాము.

Sri T. N. VENKATASUBBA REDDI:—10 కు సంబంధించిన G. O.మార్పుచేస్తారా అని నేను అడిగేది.

The Hon. Sri D. SANJIVAYYA:— Withdraw చేయము. వెనుకబడిన ప్రాంతాల్లో హాస్టల్సు ప్రారంభించే సందర్భంలో ఈ రూల్సునుంచి మినహాయింపుచేసి సహాయం చేస్తూనే వున్నాము.

Sri P. VENKATASUBBAIAH:— చెప్పిన జవాబులుబట్టి మెడ్యూలు తరగతి ప్రజలకు ప్రభుత్వమే కొన్ని హాస్టల్సు నడుపుతున్నట్లు వున్నది. అయితే సర్కారు జిల్లాలలో ఎన్ని? రాయలసీమలో ఎన్ని వున్నాయి? రాయలసీమలో యింకా ఎక్కువ పెడతారా?

The Hon. Sri D. SANJIVAYYA:—అటువంటి హాస్టల్సు ఎక్కువగాలేవు. ఎక్కడ ఎక్కడ ఉన్నాయని వేరే ప్రత్యేకంగా ప్రశ్న వేయండి. రాయలసీమలో వున్నట్లు లేవు. అన్నీ ప్రభుత్వమే స్వాధీనం చేసుకోవాలంటే కొన్ని ఆర్థిక చిక్కులు వున్నాయి.

Sri K. VEERANNA PADAL:— గవర్నమెంటు management లో వున్న హాస్టల్సులో స్టూడెంటుకు రు. 20 లు యిస్తారు; ప్రవేటు హాస్టల్సులో రు. 15 లు యిస్తున్నారు. దీనికి కారణం తెలియజేస్తారా ?

The Hon. Sri D. SANJIVAYYA:— ఈ తేడా ఎందుకో నాకు ఖచ్చితంగా తెలియదు. కనుక్కొని చెబుతాను. రు. 15 లు యిస్తున్నామంటే వారికి అయినంతఖర్చు యివ్వడంకాదు. They are

called subsidised hostels. గవర్నమెంటు నడిపే హాస్టల్సులో అక్కడ అయ్యే ఖర్చులంతా ప్రభుత్వమే భరించవలసి ఉంటుంది.

Sri S. KASI REDDI : అధ్యక్షా, వెనుకబడిన ప్రాంతాలలో తాలూకా హెడ్‌క్వార్టర్సులో హాస్టల్సు లేవు. అటువంటి చోట్ల హాస్టల్సు నడపడానికి పెట్టుబడిలేక కొంతమంది ముందుకు రాలేకుండా ఉన్నారు. అందుచేత ప్రభుత్వంవారు అటువంటివారికి ముందుగానే సబ్సిడీయిచ్చి సహాయపడతారా?

The Hon. Sri D. SANJIVAYYA :—ఉమ్మడి రాష్ట్రంలో కూడా ఒకటి రెండుచోట్ల ఆ విధముగా యిచ్చినట్లు నాకు గుర్తువుంది. మన రాష్ట్రంలోకూడా ఎవరైనా ముందుకు వచ్చుటకు సిద్ధముగావుంటే తాలూకా కేంద్రాలలో హాస్టల్సు పెట్టేదానికి తప్పకుండా ప్రభుత్వం సహాయం చేస్తుంది.

Sri C. SUBBARAYUDU :— ఇప్పుడు అన్ని హాస్టల్సుకి డబ్బుచాలక చాలా యిబ్బందులు పడుతున్నారు. కర్నూలు హాస్టలు క్లోజుచేసే పరిస్థితులు ఏర్పడినవి. మూడు మాసములనుండి సబ్సిడీరాక డబ్బుకు యిబ్బందిపడుతున్నారు.

The Hon. Sri D. SANJIVAYYA :— ఉత్తర్వులు యిదివరకే జారీఅయినవి. ఇప్పుడు ఆలోచించ నక్కరలేదు. సబ్సిడీ డబ్బు మూడు ఇన్‌స్టాలమెంట్సులో ఇస్తారు. మొదటిది July లోను, రెండవది అక్టోబరు, మూడవది జనవరిలోను యిస్తారు. ఈ కర్నూలు హాస్టలు విషయమై డైరెక్టరుగారు నాతో చెప్పేవున్నారు. నేను టెలిగ్రాంద్వారా వివరములు తెలుసుకొని వెంటనే ఏర్పాట్లు చేస్తాను.

Sri R. SIDDANNA GOWD :— అయ్యా, ప్రస్తుతము తాలూకా హెడ్‌క్వార్టర్సులో వున్న హాస్టల్సు అన్నింటిని ప్రభుత్వం వారే నడపకూడదా.

The Hon. Sri D. SANJIVAYYA :— గవర్నమెంటువారే నడపడం అంటే ఆర్థికముగా యిబ్బందిరావచ్చును. కాని వీలున్నంత వరకు తప్పకుండా ప్రయత్నించేస్తాము.

Sri P. BAPU NAIDU :— గ్రాంటులు ఇస్తున్న హాస్టల్సుకు ముందుగా డబ్బు అడ్వాన్సు చెయ్యడంవల్ల చాలా జిల్లాలలో పిల్లలకు తిండికూడా పెట్టకుండా వున్నారు.

The Hon. Sri D. SANJIVAYYA :— ఆ విషయం నాకు తెలియదు.

Sri P. VENKATASUBBIAH:-కడప, కమలాపురం, బద్వేలు తాలూకాలలో హాస్టల్సు లేవు. మెయ్యాల్లు క్లాసులవారు చాలా యిబ్బందులు పడుతున్నారు. అక్కడ ప్రస్తుతము పనిచేయుచున్న హాస్టల్సు గుర్తిస్తారా ?

The Hon. Sri D. SANJIVAYYA :— వాటిని గురించి ఆలోచిస్తామండి.

Mr. SPEAKER:— 298 వ ప్రశ్నకు (a) సభ్యులు ఇప్పుడు ఉప ప్రశ్నలు వేయవచ్చును.

* 298 Q.—Sri K. KRISHNA RAO :— ప్లానుల్లు ఇచ్చినారు. వాటి ఎగ్జిక్యూషన్ విషయమై ఏమీ తెలియచెయ్యడం లేదు. మీరు వేసే ప్లానులకు, ఎక్సిక్యూషనుకు చాలా వ్యత్యాసంవుంది. బొద్దులుగా ప్లాన్లు యిస్తున్నారు. ఇందువల్ల ప్రయోజనంలేకుండా పోతుంది. కొన్నింటినిమాత్రం అమలుజరిపి, కొన్నింటిని డ్రాపుచేస్తున్నారా ?

The Hon. Sri D. SANJIVAYYA :— కొన్ని ప్లాన్లు ఆచరణ సాధ్యంకావని తెలిసినప్పుడు డ్రాపుచేస్తున్నాము.

Sri R. SIDDANNA GOWD:—అధ్యక్షా, హరిజనపాలెంలో హైడ్సు, స్కిన్సు పూరవేసేదానికి గుంతలు తీస్తారు. వీటినుండివచ్చు దుర్వాసన ప్రజల ఆరోగ్యానికి భంగకరముగా ఉంటూవుంది. కాబట్టి వాటికి వేరేజాగా ఏర్పాటుచేసేదానికి ప్రభుత్వం ఆలోచిస్తారా ?

Vide:- (a) Appendix at page 705 infra. The question was answered on 15-3-54.

The Hon. Sri D SANJIVAYYA :— అది నిజమే. నేను కూడా చూచాను. మర్యాసనవచ్చి ప్రజల ఆరోగ్యానికి భంగకరముగా వుంటుంది. విలువున్నప్పుడు వేరేస్థలముల ఏర్పాటుకు ప్రభుత్వం ప్రయత్నిస్తుంది.

Sri PILLALAMARRI VENKATESWARLU :— మీరు యిచ్చిన సమాధానములో 14 కేసులలో ప్రొపోసల్సు డ్రాపు చేసినట్లు చెప్పినారు. ఈ 14 కేసులు ఎన్ని సంవత్సరాలనుండి వున్నవి, వాటిని ఎప్పుడు డ్రాపుచేసినారు.

It is said in the answer: "In 14 cases the proposals to acquire land were dropped. As the connected disposals have been destroyed due to efflux of time the reasons for dropping the proposals are not available."

The Hon. Sri D. SANJIVAYYA :—Speaking from memory, I think in certain cases, papers of ten years are pending.

ఏవి ఎప్పుడు ప్లానింగు అయినవో చెప్పలేను 1950–51లో డ్రాపు అయినవి మాత్రం నేను చెప్పగలను. రికార్డులు సుమారు 10, 12 సంవత్సరముల వరకు ఉంచుతారు.

Sri PILLALAMARRI VENKATESWARLU :— రికార్డులు ఎన్ని సంవత్సరాలు ఉంచుతారు.

The Hon Sri D. SANJIVAYYA :—12, 15 సంవత్సరాల నుండి పెండింగులోఉన్న కేసులు నా దృష్టిలోనికి వచ్చినవి. నేను వాటిని చూస్తున్నాను. ఇకముందు లేకుండా హరిజనులకు ఏ విధముగా సహాయం చెయ్యవలయునో మీరు మేము కూర్చొని చెయ్యవలసిన కార్యక్రమము చాలా వున్నది. త్వరగా జరుగవచ్చునని చెబుతున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ప్రభుత్వం తిరిగి ఆలోచించడానికి ప్రయత్నిస్తుందా?

The Hon. Sri D. SANJIVAYYA:—ఈ 14 కేసులలో తెలియచేయగా కాని కొన్ని కేసులు తెలిపి ఉన్నవి. భూస్వాములు భూమి ఇవ్వడానికి ఇష్టపడతేను, ప్రభుత్వానికి చెందిన పొలము పట్టాలు ఉండేవారిని కోరి ఆ భూమి ఇవ్వడానికి అభ్యంతరము లేదు. కలెక్టర్లు కొన్ని చోట్ల ప్రొసీడింగ్సు డ్రాపు చేస్తున్నారు. కొన్ని చోట్ల హరిజనులే మాకు ఆ భూమి వద్దు అంటే ప్రొసీడింగ్సు డ్రాపు చేస్తున్నారు.

Sri P. RANGA REDDI:—హరిజనులకు భూములను ఇవ్వడానికి పెద్ద ఆటంకముగా ఉన్నది. ల్యాండు ఎక్విజిషను ఆక్టును సవరించవలసిన అవసరం ఉంది.

The Hon. Sri D. SANJIVAYYA:—అది ఒకటే కారణమని చెప్పలేము. ప్రధాన కారణము అది అని చెప్పగలను. ఈ ఆక్టు సవరణకు ప్రయత్నం చేస్తున్నాము. నాకు కూడా కొంత తెలుసును. అదీగాక లీగలు డిపార్టుమెంటువారు కూడా కన్సల్టుచేసి వచ్చే సెషనుకు బిల్లు ప్యాసు అయ్యేటట్లు చూస్తాము. మిగతా కారణాలుకూడా ఉన్నవని చెప్పేఉన్నాను.

Sri G. RAMARAO.—అక్వైరు ఇప్పుడు ల్యాండు అక్విజిషను ఆక్టు ఒక్కటే కాదు ఆటంకము. ప్రభుత్వంవారు బడ్జెటులోకూడా ఆటంకములు కలుగచేసేరు. హరిజను సైట్సుకును, path-ways విషయమై కొంత బడ్జెటులో ఇచ్చేరు. వీటికి వేరు వేరు గా provision బడ్జెటులో చూపారు. ఇళ్ల స్థలాలకు భూమి acquire చేసే టప్పుడు, యిళ్ళమధ్య street కూడా వేయవలసివుంది. యీ వీధులకు యిళ్ళస్థలాలకు కేటాయించిన ప్రత్యేక డబ్బునుండిగాక, path-ways burial grounds వగైరాలకు ప్రత్యేకించిన డబ్బునుండి ఖర్చుచెయ్యాలని రూల్సు వున్నాయి. అందువల్ల వీధుల నిమిత్తం కేటాయించిన బాపతులో డబ్బు లేకపోతే మొత్తం acquisition ఆపుచేయడం జరుగుతున్నది.

The Hon. Sri D. SANJIVAYYA:— పాత్ వేస్ కొత్తవి కాదు. పాతవాటికి పాత్ వేస్ చూపవలెనని అన్నాము కొత్తవాటికి, దారిలేనివాటికి ఏ విధముగా ఇవ్వవలెనో తెలియదు.

Sri K. SUBBA REDDI:—అధ్యక్షా, గ్రామాల వెలుపల హరిజనులకు గృహవసతి చూపించుతున్నారు. ఆవిధంగాకాక గ్రామం మధ్యలోనే గృహాలు requisition చేసిహరిజనులకు ఎందువలన ప్రభుత్వము యివ్వకూడదు?

The Hon. Sri D. SANJIVAYYA:—సుబ్బారెడ్డిగారు చెప్పినదానికి ప్రభుత్వమునకు ఎట్టి అభ్యంతరము లేదు.

Sri K. KRISHNARAO:—కొన్నిచోట్ల Harjan Welfare Officers అర్జీలు పెట్టకున్న వారిని, భూస్వాముల అండలో, తిరిగి అవసరము లేదని నిర్బంధముగా applications వ్రాయించుకుంటున్నారని ప్రభుత్వానికి తెలుసా? దానిని నిరోధించడానికి ప్రభుత్వము ఏమిచర్యలు తీసుకొంటుంది?

The Hon. Sri D. SANJIVAYYA:—అటువంటిది నాకు తెలియదు. అటువంటిది నా దృష్టికి తెస్తే తప్పకుండా విచారించుతాను.

Sri A. VENKATARAMARAJU:— గ్రామాలలోచేరిన స్థలాలను చూపిస్తారన్నారు. కాని ఆయకట్టులోవుండే వాటిని చూపించడము జరుగుతోంది. దీనిని వెంటనే విచారిస్తారా?

The Hon. Sri D. SANJIVAYYA:—తప్పకుండా చూస్తాము.

Sri D. LAKSHMAIAH:- సత్తెనపల్లితాలూకాలో గడపాడు గ్రామం హరిజనులు స్తలమునకు దరఖాస్తు పెట్టగా ఒక లేబరు ఆఫీసరు ఒక స్థలాన్ని recommend చేశారు. ఆయన transfer ఐపోయాడు. తర్వాత ఇంకొక labour officer వచ్చి దానిని యివ్వడానికి వీలు లేదని objection పెట్టారు దీని విషయమై మంత్రిగారికి తెలుసా?

The Hon. Sri D. SANJIVAYYA:— నాకు particulars యిస్తే విచారించుతాను.

Sri P. SYAMASUNDARA RAO:—ఈ భూములిచ్చే సంక

లున్నాయి. 12 కుటుంబాలవారికే చాలదు. అందుకనే ఆ 12 కుటుంబాలవారు పోను, మిగిలిన కుటుంబాలకు Assembly Hall కు ఎదురుగావుండే స్థలాన్ని యివ్వమని చెప్పాను.

Sri P. VENKATASUBBAIAH :—హరిజన అభివృద్ధి ప్రణాళికకు కేంద్రప్రభుత్వము 95 వేల రూపాయలు మంజూరుచేసినట్లు, ఆడబ్బు మార్చి ఆఖరులోపున lapse అవునట్లు పత్రికలలో చూచాము. ప్రభుత్వము ఎంత ఖర్చుపెట్టదలచుకున్నారో చెప్పగలరా ?

The Hon. Sri D. SANJIVAYYA :— ఇది మనకు ప్రత్యేకముగా యివ్వలేదు. ఉమ్మడి రాష్ట్రానికి 3 లక్షలు యిచ్చినారు. మన share కు 95,500 రూపాయలు వచ్చింది. నేనుకూడా పత్రికాముఖంగా చూచాను. Schemes భారత ప్రభుత్వానికి పంపాము. ఆ schemes గురించి వారి ప్రత్యుత్తరముకోసము కాచుకొనివున్నాము.

Sri R. SIDDANNA GOWD :— అధ్యక్షా, హరిజనవాడలలో మరుగుదొడ్ల సదుపాయాలులేవు. వాటిని ఏర్పాటు చేయడానికి Government వారు సగము, పంచాయతీవారు సగము డబ్బు వేసుకొని మరుగుదొడ్లను కట్టించాలి. Planning Code క్రింద పంచాయతీలు 25% ప్రజలకు ఉపయోగపడినందుకు వాండ్లు 25% ఖర్చు భరించవలసినట్లున్నది. జనులు ఖర్చుచేయుటకు సిద్ధముకాని పక్షములో పంచాయతీలు 50% ఖర్చుచేసి ప్రత్యేకముగా హరిజనులకు మరుగుదొడ్లను ఏర్పాటుచేస్తారా ?

The Hon. Sri D. SANJIVAYYA :— అధ్యక్షా, ఒకచిన్న ఉపన్యాసము జరిగింది. హరిజనులకు మరుగుదొడ్లను ఏర్పాటు చేస్తున్నాము. ఈ పంచవర్ష ప్రణాళికలో పంచాయతీలు 25% యివ్వాలి మిగిలిన 25% ప్రజలు ధనరూపేణాగాని, వస్తురూపేణా గాని, శ్రమరూపేణా గాని యివ్వవచ్చును.

Sri P. RANGA REDDI:-అధ్యక్షా, ఇది ప్రధానమైనసమస్య. దానిలో land acquisition ముఖ్యమైనది Revenue Department వారిఆలస్యమువల్ల ఇండ్లస్థలాలుత్వరగాలభ్యంకాక హరిజనులుఅనేకయిబ్బం

slender financial position of the Government, it is not posible to consider the question of further enhancement at present.

Mr. SPEAKER.—Question hour is over.

Sri V. GOPALAKRISHNAIAH:— అధ్యక్షా, మిగతా ప్రశ్నలను, రేపు తీసుకుంటారా?

Mr. SPEAKER:—Unless a special request is made by any hon. Member the questions of to-day, not answered, will not go over for to-morrow.

Please give notice at the table.

## ADJOURNMENT MOTIONS.

Mr. SPEAKER:— Sri D. Seetharamaiah has given notice of an adjournment motion day before yesterday. It reads as follows:—

"This House stands adjourned to discuss a definite matter of urgent public importance viz.,

The grave situation arising out of the utterly destituted and incapacitated peasants of Chittoor Distirict being subjected to unusual and forcibale collection in a lumpsum all the arrears of land tax and cesses which have accumulated during the famine period of 1361 and 1362 faslies."

I am disallowing it, because it relates to the day to day administration of the Revenue Department.

## PRIVILAGE MOTION.

Then comes the privilege motion of Sri Vavilala Gopalakrishnaiah. I ask the hon. Member to produce *prima facie* proof. I am adjourning it to to-morrow.

17th March 1954] [Sri G. Rama Rao

To reduce the allotment of Rs. 2,72,38,500 under Demand XI — District Administration and Miscellaneous.

The motion was duly seconded.

Mr. SPEAKER:— The other cut motions shall be deemed to have been moved.

Sri P. VENKATASIVAIAH: అధ్యక్షా, ఈ District Administration demand ను ప్రభుత్వం తెచ్చింది. ఈ demand విషయములో cut motion బలపరుస్తూ కొన్ని సంగతులు మీకు చెప్ప వలసియున్నది. ఈ district administration ప్రభుత్వం విధానములో అన్ని శాఖలకు సంబంధించి వున్నది. దీనిలోని వ్యవహారాలు ప్రజలకు సంబంధించినవి. సబ్బీగూడ, కాగితము పెట్టినట్లయితే, అవి సంవత్సరముల తరబడి అట్లాగే pending గా వుంటూ, చివరకు ఎట్లా తేలకుండా files "లాడ్జి" (lodge చేయటం, జరుగుతున్నది. కొన్ని చోట్ల యీ pending files జాస్తి అయినప్పుడు పై ఆఫీసరు భయపడి ఆ files ను destroy చేయటంగూడ జరుగుతున్నది. ఒక్కొక్క తాలూకాలో, తహశీలు దారు వద్ద, యిండ్లస్థలదరఖాస్తులు, భూమి దరఖాస్తులు మొదలైన కాగితాలుసంవత్సరాలతరబడి pendingగా వున్నాయి. వాటినిజమాబందీ సమయములలో కలెక్టరు మొదలైన ఆఫీసర్లు వస్తుంటారని వుద్దేశ్యంతో,— యిట్లా పెండింగుగా వున్నటువంటి కాగితాల నన్నింటిని తగలపెట్టివేస్తున్న సంగతులు, ఖచ్చితముగా నాకు తెలుసును ఈ రకమైనటువంటి పనులు జరగటం, ఆలస్యం కావటంవల్ల, ప్రజల సమస్యలు పరిష్కారము కాకుండా పోవటం జరుగుతున్నది. కొన్ని కొన్ని జిల్లాలలో అనేక అభివృద్ధి స్కీములకు, Rural welfare, water supply స్కీములకు, ఇతర యిరిగేషన్ స్కీములకుగాను యివ్వబడిన అప్పులు దరఖాస్తులు dispose కాకుండా పోవటం, ఆ తరువాత అవి లాప్సు కావటం జరుగుతోంది గాని పనులు జరగటం లేదు. ఈ departmentలు క్షణం తీరుబడి లేకుండా నడుస్తూవుంటాయి. కాని పనులుమాత్రం సాగిపోవటంలేదు.

ఈ District Administration లో supervise చేసేటటువంటి అంచెలు చాలావున్నవి. ఉదాహరణకు, రివిన్యూ డిపార్టుమెం

17th March 1954] [Sri P. Venkatasivaiah

ఇప్పుడు land assignment విషయంలో Revenue Divisional officers కు అధికారాలులేవు. అటువంటప్పుడు direct గా కలెక్టరుకే పంపిస్తే కొంత time save అవుతుంది. అట్లుచేయకుండా, యీ R. D. O. అనే post office ఉండడంవల్ల, తాశీల్దారు యితనికి పంపించ వలసియుంటుంది. ఇక్కడ కొంత ఆలస్యం అవుతూవుంటుంది. అక్కడ నుంచి కలెక్టరుకు వచ్చేటప్పటికి, మొత్తం ఒక సంవత్సరం పూర్తవు తుంది. ఈ విధంగా ఒక సంవత్సరంనుంచి ఆ application క్రిందికి పైకి, పైకి క్రిందికి తిరిగింది అంటే ఎంత ఆలస్యము అగుచున్నదో ఆలో చించుకోవచ్చును. ఇలా అనవసరమైన post offices మూలకంగా administration త్వరగా జరగకపోవడం, సమస్యలు తొందరగా dispose of కాకపోవడం జరుగుతుంది. రెండవది ఈ రకమైనటు వంటి supervisory stations ఎక్కువగా ఉండడమేకాకుండా, red-tapism కూడ ఎక్కువగా వున్నది. ప్రతిచోట, ప్రతి విషయంలోను ఈ redtapism విపరీతంగా ఉంటున్నది. ఈ డిపార్టుమెంటుల్లో bribery ఎక్కువగా ఉంటున్నది. ఏదో services render చేసినందుకు మామూలుగా 1-0-0, 0-8-0 ఇచ్చికంగా ఇచ్చేదాన్నిగురించి మాట్లాడలేదు. Supreme court ది, హైకోర్టుది dicision కూడ వున్నది. మామూలు పట్టింపులేదని, కనుక ఆ విషయంగురించి మాట్లాడ లేదు. Land assignment విషయంలో 20 సంవత్సరములనుంచి ఒక బంజరును సాగుచేసుకొంటున్నటువంటి ఒక మాదిగతను 2 వందలు రూపాయలు ఒక కరణానికియిచ్చి B. form యిప్పించవలసిందనికోరితే, ఆయన నీవు 18 నెలలుగా దీనిని సాగుచేయలేదని objection చెప్పాడు. అప్పుడు కరువు వచ్చినందువల్ల, ఎవరుకూడ విత్తనాలు వేయలేదు. అలాంటి సమయంలో సాగు చేయ లేదని చెప్పి, యింకెవరికో B form యిస్తానని చెప్పి, మరల వాళ్ళదగ్గర ఒక 2 వందలు తీసు కొన్నాడు. తరువాత court లో tresspass క్రింద కేసుపెట్టడం జరిగింది. ఆ తరువాత శిరస్తాదారుదగ్గర రాజీపరిష్కారం చేయడం జరి గితే, ఆ రాజీ తీర్మానాన్నిగూడ ఉల్లంఘించి ఆ కరణం మళ్ళీ యింకొక రికి B form వ్రాయడం జరిగింది. ఆ తరువాత జమాబంది టైములో కలెక్టరువద్ద పిటీషను పెడితే, దానిపైన కరణము మాట్లాడక పోవడం

చివరకు 20 ఏళ్లుగా సాగుచేసుకొంటున్నటువంటి applicant కు ఆ పొలము దక్కదని తెలిసినపుడు, ఆ కోపముతోటి అతను, ఆ జమాబంది ఆఫీసరు, తాశీల్దారు, రివిన్యూ ఇన్‌స్పెక్టరు యెదుటనే అదే హాలులోనే చెప్పుతీసుకొని కరణాన్ని మూడుమార్లు కొట్టాడు. అప్పుడు ఎవరో వచ్చి విడిపించారు. ఆ విధంగా కొట్టినతరువాత యిది యిలా జరిగిందని కరణం చెప్పాడు. చెప్పుతో కొట్టినందుకు 353 సెక్షన్ క్రింద ఆ 65 ఏళ్ళ ముసలివానిపైన ఈ రోజున కేసుపెట్టారు. కాని కరణంపైన ఏమి చర్య తీసుకొన్నారో యింతవరకు తెలియలేదు. తరువాత ఈ విధంగా ఎవరో కొట్టించారని వారిమీద దొంగతనం కేసు ఒకటిపెట్టి, అతనిని జైలులో పెట్టించి, పోలీసులచేత బాధింపబడడం జరిగింది. ఈవిధంగా local గా ఉండేటటువంటి factional quarrels తీర్చుకోడానికి కూడ దీనిని ఉపయోగించారు. ఈ విధమైనటువంటి దుర్మార్గాలు, లంచాలు తీసుకోవడం యీ డిపార్టుమెంటులో పరిపాటిగా వస్తూన్నది. ఈ supervising staff, అనవసరపు పోస్టాఫీసులు ఎక్కువయిపోయు. redtapism, లంచగొండితనము ఎక్కువగా ఉంటున్నవి. మరియు administration లో చాలా ఆలస్యం జరుగుతున్నది. మా ఊళ్లో ఒక పొలము విషయంలో అధికారులు 4 వందలు లంచము తీసుకొని, యింకెవ్వరికీగాని లంచము యివ్వవలసిన అవసరంలేకుండా ఏర్పాటు చేస్తు కొని, కరణానికిగాని, R. I. కి గాని, తాశీల్దారుకుగాని ఎవరికి యివ్వ నవసరం లేకుండా పరిష్కారంచేస్తే ఏర్పాటు చేసుకొన్నారు. దీనిని 'A' form record లో సంతకం పెట్టాము. తరువాత తాశీల్దారు దగ్గర ఒక ఉద్యోగస్తునికి మామూలు రానందున, అక్కడ 1 సంవత్సరం పడివున్నది. అయితే ఫలానా application కు యివ్వవచ్చునా, ఇవ్వ కూడదా అనేదాన్ని పరిష్కారంచేసి, వెంటనే దాన్ని dispose of చేస్తే అభ్యంతరంలేదు. ఆ విధంగా చేయడంలేదు. ఇకపోతే services లోను ఒక విషయంవున్నది. మనది కొత్త State అయినపుడు, యిదివరకు పాత State లో ఉండేటటువంటి అలవాట్లే కొత్త State లో కూడ రావడమునేది మామూలుగా జరుగుతూవుంటది. అయితే యిది వరకున్న పాత దురలవాట్లు లేకుండా చేస్తామని ప్రభుత్వము యెన్నో సార్లు హామీలు యిస్తూవుంటారు. ప్రత్యేకంగా corruption తొల

గించడానికి anti-corruption department కూడ ఒకటి వున్నది. ఇదికూడ corruption department గానే మారిపోయింది. ఈ విధంగా corruption అన్ని డిపార్టుమెంట్లులోనూ జరుగుతూనే వున్నది. అసలు దీనికి మూలకారణం ఏమిటో ప్రభుత్వము ఆలోచించనే లేదు. గవర్నమెంటు ఏదైనా సరే స్థిరంగా, బాగా efficient గా నడవాలంటే అది contented services మూలంగానే జరగాలి ఈ services contented గా లేకపోయినట్లయితే, ఆ ప్రభుత్వము పైపైకి ఎన్నికబుర్లు చెప్పినప్పటికి. అవి బయటికిమాత్రమేగాని, లోపలమాత్రము డొల్లే అనేసంగతి ప్రభుత్వములో ఉండేవాళ్ళకు తెలిసినట్లువంటి సంగతే అనుకొంటాను.

అందుకోసము ప్రభుత్వోద్యోగుల్లో వున్న తప్పులు సరిదిద్దటానికి, వారిలోవుండే bribery అరికట్టడానికి వీలులేకుండా పోవటానికి కారణము, యిప్పుడు అమలులోవున్న service conditions మాత్రమేనని అంటున్నాను. దీన్ని ప్రభుత్వం గుర్తించాలి. ప్రభుత్వోద్యోగులలో bribery వున్నదని ప్రభుత్వానికి తెలిసియున్నప్పటికి గూడా, దీన్ని అరికట్టటానికి ప్రభుత్వానికి సాధ్యపడడములేదు. ఏదో అక్కడక్కడ వ్యక్తిగతంగా ప్రభుత్వం కొన్ని కేసులు పెట్టించింది. అంతే కాని దీన్ని పూర్తిగా అరికట్టటానికి తీవ్రమైన చర్యలు తీసుకోవటంలేదు. ఈమధ్య మా తాలూకాలో రెండు కేసులు జరిగినవి. లంచము యిచ్చినవారు, యిప్పించినవారు, పుచ్చుకొన్నవారు, మూడుభాగాలుగా వున్నారు. అయితే దీనికి ఒక కొత్తపద్ధతి పెట్టారు. లంచము యిచ్చిన వారియొక్క పని నెరవేరకపోతే, వారిలంచమువిషయములో తగాదా చేస్తే తీసుకున్నవారు ఉద్యోగములోవున్న కారణముచేత తమమీద దొమ్మీచేశారనే నేరారోపణతో పెద్దపెద్ద కేసులు బనాయించడంగూడా జరుగుచున్నది. ఈ రకమైన కేసులుగూడా పెట్టడము జరుగుచున్నది. సెంట్రల్ గవర్నమెంటువారు corruption నిర్మూలనకు ఒక యాక్టు తెచ్చారు. వారు లంచాలు యిచ్చినవారిమీద, పుచ్చుకొన్నవారి మీద కేసులుపెట్టి శిక్షలుగూడా వేయించుచున్నారు. కాని అవి రుజువు కావడము అసాధ్యమైన పనిగా యున్నది. లంచము యిచ్చినవాడు యిచ్చానని, తీసుకున్నవాడు తీసుకున్నానని, ఎన్నటికైనను చెబుతాడా!

అందువల్ల రుజువుకాలేదని తప్పిపోయిన కేసులుగూడా వున్నవి. అందువల్ల లంచగొండ్లమీద కేసులు పెట్టాలంటే, ముందుగా plan వేసి, trap పెట్టి, పట్టుకుంటేనేతప్ప, యితర విధములుగా కేసులు రుజువు కావడము సాధ్యపడదు. అటువంటి trap పెట్టిన కేసులుగూడా కొన్ని రుజువు కావడములేదు.

ప్రయివేటుగా లంచాలు తీసుకొన్న ఒక Sub-Inspecter, తనకు ఏమీ అధికారములేని చోటకు ఒక డిక్రీని అమలు పరచటానికని, ఒక పార్టీ యిదివరకు కొన్నదాన్ని మరొకరు కొన్నదానిని స్వాధీనముయిప్పించటానికి మద్దతుకు, వెళ్ళగా ఆ ప్రయత్నము విఫలమైపోయింది. తరువాత రెండవసారి పోలీసువారిని అమీనాను పిలుచుకొని పోయినాడు. అట్లాంటి సమయములో అమీనా ఆ డిక్రీ ప్రకారము ఆస్తి ఋణస్తుని స్వాధీనములో లేదని వ్రాసుకుంటే పోయేది. అటువంటిది యీ డిక్రీ అమలు పరచటానికిpossesion లో వున్నవారిని arrest చేయటానికి ఆ విధంగా తరువాత కేసుపెట్టటానికి డబ్బుయిచ్చి పిలుచుకొని పోయారు. ఈ విషయములో పోలీసువారికి మూడు రకాలుగా డబ్బుయిచ్చారు. ఇంత డబ్బున్నా పుచ్చుకొని, చివరకు ఏ కేసులుకూడా లేకుండాబైటికిరావడం జరిగింది. తరువాత యీ రెండు పార్టీలవారు పోలీసువారిమీద affidavit యివ్వటానికి, నిత్యము ఉద్యోగస్తులతో ఏదో విధంగా లావాదేవీలు వుంటవి అని భయపడి, యెవరూగూడా ముందుకురాలేదు. ఇది మావూళ్ళో నాకు తెలిసినటువంటి విషయము. ఇటువంటి దుర్మార్గాలు యీ రకంగా జరుగుతున్నవి. ఇలాంటివి జరుగుతున్నప్పుడు Central Acts ను అనుసరించి corruption పూర్తిగా నిర్మూలించటానికి తగిన చర్యలు తీసుకుంటానికి వీల్లేదు.

ఇక Non-Gazetted Officers కు జీతాలుయిచ్చే విషయములో మనము పార్టిషను ఐన కొత్తరోజులలో East Krishna Non-Gazetted Officers Associasion వారు Chief Minister గారికి యివ్వవలసిందిగా కోరుతూ ఒక పిటిషను finance minister గారికి సమర్పించారు. దానిపైన ఏమిచర్యలు తీసుకునేది నీకు తెలియలేదు.

17th March 1954]

The Hon. Sri T. VISWANATHAM:— రోజూ చెబుతూనే యున్నారు. ఇవ్వాళగూడా చెప్పారు.

Sri P. VENKATASIVAIAH :— మళ్ళీ ఒకసారి చెబితే ఏమైనా ఉపయోగముంటుందేమోనని చెప్తున్నాను. ఇప్పుడు నేను నా speech ని ముగించిన తరువాత మంత్రిగారికి దీన్ని యిస్తాను. ఇందులో యీ Non-gazetted Officers కోరినటువంటి కోర్కెలు మీ ఎదుట పెడుతున్నాను.

ఇప్పుడు Central Government వారు యిచ్చే scales of pay కున్నూ, Provincial Government వారు యిచ్చే pay కున్నూ చాలా వ్యత్యాసములు వున్నవి. ఈ difference ఎందుకు వుండాలో నాకు అర్థము కావడములేదు. కనీసము Central government వారు యిచ్చే pay scales అయినను యివ్వడం అవసరంగా వున్నది, ఆ scales ను యిక్కడ వీరికిగూడా యివ్వవలెనని కోరుతున్నాను. ఈమధ్య Central government వారు Dearness allowance pay లో కలిపివేయాలని ఎంక్వైరీ కమిటీని నియమించారు. ఆ విధంగా Dearness allowance ను యిక్కడ వీరికిగూడా pay లో merge చేయాలని అంటున్నారు. ఇది వారి కనీసపు కోరిక. అంతే కాకుండా ఒకవేళ living index పెరిగినట్లయితే, మరల Dearness allowance గ్రాంటు చేయాలనిగూడా అంటున్నారు. ధరలు యిప్పట్లో తగ్గేసూచనలులేవు గనుక, ప్రభుత్వానికి వెన్నెముకగావుండే యీ non-gazetted officers కు ఆ మాత్రము సహాయ్యముచేస్తే బాగుంటుంది. నిన్న Central Financial Minister గారు మాట్లాడుతూ రు. 6,700 కోట్లు నోట్లు ముద్రించి దేశంలో పారవేయబోతామని చెప్పారు. అందువల్ల ఇప్పుడు వున్న ధరలు కొంత పెరగటానికి chance వుంటుంది. ఇలాంటిది రాబోతున్నది కాబట్టి తప్పకుండా యీ Dearness allowance మొత్తమును అంతా పారితోషికముతో కలిపివేసి, consolidated pay గా నిర్ణయం చేసి, ఆ తరువాత యింకను ధరలు అధికముగా వున్నట్లయితే, వేరే Dearness allowance ను ఏర్పాటుచేయాలని యీ Non-gazetted Officers కోరుతున్నారు.

17th March 1954] [Sri P. Venkatasivaiah

లేకుండా పోయింది. ఈ వుద్యోగస్థులు తమ సర్వీసును అన్యాయముగా నాశనము చేసుకొన్న వారవుతున్నారు.

ఇదేమాదిరిగా conduct rules అని వున్నది. ఇవికూడా మార్చి వేయవలసిన అవసరము వున్నది. నాకు యిప్పుడు టైము లేనందున యీ విషయములో వున్న defects చెప్పలేకపోతున్నాను. ఈ rules ను reform చేయాలని చెబుతున్నాను. ఈ మార్పులన్నీ చేయక పోయి నట్లయితే, ప్రభుత్వ కార్యనిర్వహణము సక్రమంగా జరుగదని చెప్పుతూ, యింతటితో విరమిస్తున్నాను.

Sri T. N. VENKATASUBBA REDDI:— అధ్యక్షా, ఇప్పుడు గౌరవనీయులైన సభ్యులు చెప్పినవాటిలో చాలమట్టుకు నిజము వుందని నేను వొప్పుకొనకతప్పదు. ముఖ్యంగా ప్రభుత్వపుఖర్చులు రానురాను సంవత్సరము సంవత్సరమూ, యెక్కువవుటమేకాని, శాసన సభలో ప్రభుత్వపక్షం, ప్రతిపక్షంవారికి, మాకగా రెండు సంవత్సరముల నుండి అవకాశము వుంటున్నప్పటికీ, మా party లో నైతేనేమి, శాసనసభలో నైతేనేమి, ప్రభుత్వంచేసే వ్యయం establishments మీద, ఆఫీసర్లమీద తగ్గించమని, వీలున్నంతవరకు ఆ వ్యయాన్ని ప్రజా క్షేమానికే వినియోగించమని పెక్కుసార్లు చెప్పాము. ప్రభుత్వము అలాంటి సూచనలు తీసుకొనకుండా, ప్రతిసంవత్సరమూ యేదోవొక సాకుమీద గమనించకపోవడం చాలా వ్యసనంగావుంది. రెండుకోట్ల, డెబ్బది లక్షలు అంటే, రెండు ముక్కాలు కోట్లు ప్రభుత్వము వీటిక్రింద ఖర్చు పెడుతున్నారు. దాదాపు మన రాష్ట్రి రెవిన్యూలో దగ్గర దగ్గరగా యేడింట, ఒకపాలు యీ విధంగా ఖర్చు అవుతోంది. ఇది ఒక ముఖ్య అంశము. కేవలం యింత వ్యయం అవసరము వున్నదా? అని నేను అనుకుంటున్నాను. ఇదంతా యేమిటో, దానివలన ప్రజలకు యేమాత్రం వుపయోగం కల్గుతున్నదో అన్నవిషయం ఆలోచించవలసిన అవసరము వున్నది. దేశంలో ముఖ్యంగా Revenue department లో minor works క్రింద యేమాత్రం వుండదను కొంటున్నాను. Minor irrigation Supervisors కు వారికేదో అనుకూలం కోసమే కల్పించి నట్లుగావుంది. 1939-వ సంవత్సరములో యుద్ధం ప్రారంభముకాగానే, మనకు కల్గిన ఆహార దుస్థితివల్ల నైతేనేమి, ధరలు విపరీతంగా పెరిగి

దుస్సాధ్యం. ప్రతివారూ మనం పెద్ద పెద్ద వుద్యోగులకు, చిన్న చిన్న వుద్యోగులకు వుపదేశాలు యిస్తున్నాము. వారు వుత్సాహంతో పని చేయాలని, లంచగొండితనం వారిలో వుండకూడదని మనం చెబుతున్నాం. వారిని మన దేశీయులుగా, మానవులుగా భావించివుంటే. లంచగొండితనము మనలాంటి మనుష్యులే కొన్ని కొన్ని పరిస్థితులలో చేస్తారని మనం గుర్తించవలసిన అవసరం వుంది. మన దేశంలో మన ప్రభుత్వంలో లంచగొండితం వుందంటే అది యేయే కారణములవచ్చిందో, అది ఏమిచేస్తే తగ్గుతుందో పరిశీలించుదాము.

మన services (State services) అని, All India Services అని కొన్ని వున్నాయి. వాటికి ముందటి ప్రభుత్వము నుంచి, ఇప్పటివరకు కొన్ని service conditions పెట్టారు. వాటికి political interference గాని official interference గాని లేకుండా చేసి, చాలినంతవరకు ఆ services మంచిగా వుండుటకు కావలసిన conditions British ప్రభుత్వము లోనే తయారుచేసిపెట్టారు. వాటినే మనం యిప్పుడు అమలు పరుస్తున్నాము. వారికి నిర్ణయించిన services యే cader లో చేరినా మరి చేరిన తరువాత, వారు సక్రమంగా పనిచేస్తూంటే, మనం ప్రభుత్వములో ఒక seniority యేర్పరచి, ఒక నిబంధన యేర్పరచివుంది, service rules వుంది. మన Provincial servicesలో అటువంటివి యేమివున్నాయో పరిశీలించుదాము. చిన్న చిన్న non-gazetted services కు మొదట యేవో కొన్ని rules వున్నవి. నాకంత detailed గా తెలియదు. గౌరవసభ్యులు చెప్పినట్లుగా, ఒక వుద్యోగి, పై అధికారికి యిష్టంవుంటేనే, పైకిరాగలడు. పై అధికారికి యిష్టం వచ్చినప్పుడు యీ క్రింది వుద్యోగిని పైకి లాగుకురావాలని యిష్టంవుంటేనే, పైకివస్తాడు కాని మంచి పనివల్ల, మంచి గుణాలవల్ల, మంచి ఉత్సాహామువల్ల పైకివచ్చాడన్న కేసు ఒక్కటిగూడా నేను వినలేదు.

ఇక confidential file అని చెప్పి ఒక పద్ధతి పెట్టారు, వీటికి ముఖ్యంగా నిబంధన మన బ్రిటిషు ప్రభుత్వంవారు చాలా మంచి వుద్దేశ్యంతో పెట్టారు. మద్రాసు శాసనసభలో శ్రీ సి. రాజగోపాలాచారిని ఒక question వేశాము. ఈ confidential report లో యేదైనా

17th March 1954] [Sri K. Veeranna Padal

square miles ఏజన్సీ ప్రాంతాన్ని కలిపి ఒక జిల్లాగా ఏర్పాటుచేసి దానికి ఒక కలెక్టరును నియమిస్తే వారు అక్కడకుపోయి పరిశీలిస్తారని ఆశిస్తున్నాను. అంతేకాకుండా ఆ ప్రాంతంలో ఏ పనులుకూడా సక్రమముగా జరుగుటలేదు. ఆ ప్రాంతంలో కావలసిన irrigation schemeగాని ఏ పనిగాని temporary గా చేయడం, అది ఒకటి రెండు సంవత్సరాలలో పాడైపోవడం మూలంగా ఇప్పటివరకు permanentపని ఏమీ జరగలేదు. కనుక ఆ ప్రాంతంలోఉన్న ప్రజలయొక్క కష్టసుఖాలను మీరు పరిశీలించాలని మనవిచేస్తున్నాను. రెవిన్యూ డిపార్టుమెంట్, ఫారెస్టు డిపార్టుమెంటు మొదలైన ఇతర డిపార్టుమెంట్స్‌లో అక్కడ ఉన్నటువంటి ఉద్యోగస్తులు అందరూ అక్కడ ఉన్నటువంటి మలేరియా, నిమోనియాలవల్ల transfer చేస్తేని పోదాం అనే ఉద్దేశంతోనే ఉంటున్నారు. School teachers కు అక్కడ ఇళ్లుగాని పాకలుకాని లేవు. వాళ్ళు single గా వచ్చి ఏదో 4, 3 రోజులుగాని వారంరోజులు పనిచేసి పోయే ఉద్దేశంతోనే ఉంటున్నారుగాని అక్కడ పాకల్లో ఉండి ఆ ఏజెన్సీ ప్రాంత ప్రజల విద్యాభివృద్ధికి తోడ్పడే ఉద్దేశంలేదు. అందుచేత ఇండియా ప్రభుత్వంవారు ఏజెన్సీ ప్రాంతాలకు ఇచ్చిన గ్రాంటుతో ఆ ప్రాంతాన్ని అభివృద్ధి చేస్తారని ఆశిస్తున్నాను విశాఖపట్నం జిల్లాకు చెందిన గూడెం తాలూకా అన్ని ప్రాంతాలకంటె వెనుకబడిన ప్రాంతం. ఉద్యోగస్థులు కనుక అక్కడికివస్తే అక్కడ ఉన్న మనుషులు, అడవికి పారిపోయే పరిస్థితులలో ఉన్నారు. ఎవరినైనా పంపిస్తే అటువంటి మనుషులను నేను చూపించడానికి నిశ్చయించుకొన్నాను. అటువంటి ప్రజలకు ఆంధ్రప్రభుత్వం సదుపాయాలు కలిగిస్తారని ఆశిస్తూ నేను ఇంతటితో విరమిస్తున్నాను.

Sri P. SYAMASUNDARA RAO:—అధ్యక్షా! జిల్లా పరిపాలనా విధానంలో చాలా అన్యాయాలు జరుగుతున్నాయి. ముఖ్యంగా మా జిల్లాలో ఉన్నటువంటి పరిస్థితులు, ఇప్పటికి సుమారు ఒక నెలరోజులనుంచి చాలా తీవ్రరూపం తాల్చాయి. అక్కడ జిల్లా అధికారులద్వారా తీవ్రరూపం తాల్చిన పరిస్థితులు ఇక్కడ కొంచం చెప్పవలసినపని ఉంది. బస్సు యజమానులకు, బస్సు వర్కర్లకుమధ్య తగాదాలు ఇప్పటికి రెండు సంవత్సరాలుగా జరుగుతున్నాయి. ప్రభుత్వం దానిమీద తగిన

Sri P. Syamasundara Rao] [17th March 1954

చర్యతీసుకోకపోవడంవల్ల ప్రభుత్వంయొక్క అవకతవకలు బైట పడు తున్నాయి. వర్కర్ను జీతాలు ఎక్కువకావాలని అడగటంలేదు. వర్కర్సుకు నోటీసుకూడా ఇవ్వకుండా బస్సునడుపుతున్నవాడిని అపి యజమానులు చేయిపట్టుకు దింపుతున్నారు. అలా నోటీసు లేకుండా వాళ్ళను పనినుండి తొలగించకూడదని ఒక G. O. కూడా ఉంది. జిల్లా కలెక్టరు, లేబరుకమీషనరుకూడా పాత staff తోనే నడపవలసిందని చెప్పినప్పటికి యజమానులు లెక్కచేయకుండా వర్కర్సును పనినుంచి తొలగిస్తుంటే దాన్ని అమలు జరపవలసిన విధి, జిల్లా అధికారులమీద ఉన్నప్పటికి ఈ నాడు అక్కడ 125 మందిని పనినుంచి తొలగించారంటే ఎంత సిగ్గు చేటు? ప్రభుత్వం ఎంత ఉపేక్షభావంతో ఉన్నది తెలుస్తున్నది. అక్కడ బస్ యజమానుల సంఘ అధ్యక్షుడుగా ఉన్నటువంటి ఒకాయన ఒక కర పత్రంకూడా వేశాడు. సంఘం జరుపుతున్న చర్చలవల్ల బస్ యజ మానులకు వర్కర్సుకు మధ్యఉన్న తగాయిదాలను పరిష్కరించుకోడానికి బదులు వాటిని అభివృద్ధి చేస్తాయని చెపుతూ ఒక కరపత్రం వేశారు. సోదరులారా మనం ఈ వర్కర్సుమీద దాడిచేయడంవల్ల మనం నష్ట పోతాం తప్ప ఈ trans port సక్రమంగా జరగడానికి వీలుపడదనికూడా చెప్పారు. అధ్యక్షులుగా ఉన్నటువంట శ్రీ పులవర్తి అప్పారావుగారు బస్ యజమానుల సంఘచర్యలపట్ల అసంతృప్తితో రాజీనామా ఇచ్చారు. యజమానులు చేసినపనేమంటే 125 మందిని పనినుండి తొలగించారు. మరో యిద్దరు వర్కర్లకు 6 మాసాలజీతం ఇవ్వాలి. రెండుమూడుసార్లు రాజీబేరాలుకూడా సాగించి, ఒకసారి నాలుగు వందలు యిస్తామని ఇంకో సారి 5 వందలని చెప్పారు. చివరకు Dy. S. P. 480 ఇవ్వమని చెప్పారు. తిరిగి ఆ యజమానులే వర్కర్లు వ్రాసియిచ్చినట్లు ఒక ఫోర్జరీ పత్రాన్ని సృష్టించారు. యిది సంజీవరెడ్డిగారికి చెపితే 5 మాసాలు బస్సునడవ లేదు కదా, నడవనప్పుడు వాడు జీతం ఎలా ఇస్తాడని చెప్పారు. కాని బస్ వర్కర్సు 6 మాసాలజీతం మాకు అక్కరలేదు 3 మాసాల జీతం ఇవ్వమని చెప్పారు. చివరకు మా ఉద్యోగాలైనా మాకు ఇస్తే చాలని కూడా అడిగారు. అందుచేత అక్కడజరుగుతున్న పనులు ఎందుకు జరుగు తున్నాయి అనికూడా మనం అలోచించవలసిఉంది.

ఇవన్నీ యెందుకు జరుగుతున్నాయనే విషయం ఆలోచించాలి.

బస్సులు నడపడానికి ప్రభుత్వం కొన్ని నిబంధనలు చేసింది. వాటిని బస్సుయజమానులు సరిగా అమలుపరచరు. [illegible] ఎక్కువ వసూలుచేసి పట్టుకువచ్చి, వాళ్ళకే [illegible]. [illegible] వాళ్ళకు [illegible] అంటున్నారు. దానికి వర్కర్లు [illegible] పట్టుకుని కేసులుపెడితే మా లైసెన్సులు [illegible]. మా [illegible] మలగాల మాడి [illegible] చెపితే, మాకేమీ పరవాలేదు [illegible] కదా. ప్రభుత్వం, పోలీసులు మా వేపు వున్నారు, [illegible] ఏమీ చెయ్యలేరు అంటారు. దానికి ఏ వర్కరైనా [illegible] సులచేత పట్టుబడితే ఇది నాకేమీ సంబంధంలేదు. [illegible] యజమాని. కోర్టులో వర్కరును శిక్షించి, వాడి లైసెన్సును కాన్సిల్ చేస్తారు.

ఇంతేకాక నర్సాపురంనుంచి [illegible]కు ఒక బస్సు trip వేస్తే, అక్కడ కొంత interval వస్తుంది. ఆ interval టైములో బస్సు కండక్టరు, డ్రైవరు యజమానియింట్లో ఊడిగము చెయ్యాలి. చెయ్యక పోతే వాళ్ళకి ఉద్యోగాలులేవు. ఇలాంటి పెట్టిచాకిరీనుండి తమ్ము తాము కాపాడుకోడానికి, రూల్సును అనులుజరిపేటట్లు ప్రయత్నం చేసే టందుకుగాను బస్సువర్కర్లు ఒక సంఘం పెట్టుకున్నారు. యజమానులు బస్సులకు సరిగా మరమ్మత్తులు చేయించనందువల్ల బస్సుడ్రైవరు, కండక్టరు బస్సు మార్గమధ్యంలో ఆగిపోతే, అక్కడ బస్సుక్రింద పడుకుని నానా అవస్థలూపడి బాగుచేసుకోవాలి. ఇలాంటి ఇబ్బందులు కలగకుండా చూచుకోడానికే సంఘం పెట్టుకున్నారు. వాళ్ళు సంఘం పెట్టుకున్న తర్వాత వారినెట్లాగైనా అణగద్రొక్కేందుకు యజమానులు కూడా ఒక సంఘం పెట్టారు. యూనియన్‌లో చేరిన వర్కర్లకు ఉద్యోగాలివ్వకూడదని వీరు నిశ్చయించారు. సంఘంనుంచి రాజీనామా యిస్తామని వ్రాసియిచ్చినవాళ్ళనే వుంచి, మిగతావాళ్ళను తీసి వేశారు. వారి వారి కష్టసుఖాలను తీర్చుకొనేందుకని సంఘాలు పెట్టు కోవచ్చునని ప్రభుత్వం చెప్పింది. సంఘము పెట్టుకోడం నేరంగాపరిగణించి ఎవరెవరిని ఏ రోజున తొలగించారో, నోటీసులు లేకుండా తొలగి స్తున్నారో మేము జిల్లా అధికార్లదగ్గరనుంచి, మంత్రివర్గమువారకు తెలియ పర్చినప్పటికి ఏమీ చర్యతీసుకోవడం లేదు. ఇప్పటికి ఆ విధంగా 125

Sri P. Syamasundara Rao] [17th March 1954

మందిని తగ్గించారు. యజమానులు పోలీసుల సహాయంతో వర్కర్ల మీద దాడులు జరుపుతున్నారు. దీనికి ప్రభుత్వ బాధ్యత పూర్తిగా వుంది. ఇటువంటి ప్రమాదకరమైన పరిస్థితులు ప్రభుత్వం పరిష్కరించడానికి తగిన చర్యలు తీసుకోకపోవడమే దీనికంతకీ కారణము ఇది కాదంటే ప్రభుత్వం ఒక విచారణ కమిటీని వేస్తే అక్కడి పరిస్థితులు తెలుస్తాయి. వర్కర్లు యజమానులను, యజమానులు వర్కర్లను కొట్టడం యిటువంటివెన్నో జరుగుతున్నాయి. వర్కరును మొందుకు తొలగిస్తున్నారని యజమానిని ప్రభుత్వం అడిగితే, అసలు సమస్యే తీరిపోతుంది. వర్కరును తొలగించకుండా చూస్తే అసలుగొడవే లేదు. దీనిని కప్పిపుచ్చడంకోసమే ప్రభుత్వం ఒక పథాన్ని బలపరుస్తోందని ఖచ్చితంగా చెపుతున్నాను. దీనికి కావలసినన్ని ఋజువులు కూడా వున్నాయి. దీన్నంతటినీ కప్పిపుచ్చడంకోసమే రాజకీయపార్టీలపై రుద్దజూస్తున్నారు. ఇదంతా అక్కడ కమ్యూనిస్టుపార్టీ చేస్తోందని పార్టీ ఆఫీసులమీద అర్ధరాత్రివేళ దాడులుచేయించి, దుర్భాషలు ఆడిస్తున్నారు. పాపాల భైరవులు కమ్యూనిస్టుపార్టీ వాళ్లున్నారుగదా వాళ్ళ మీద రుద్దుదామని చూస్తున్నారేమో. ఈ వేళ పార్టీమీద లేనిపోనివన్నీ తీసుకువచ్చి రాజకీయంగా కక్షసాధిద్దామని అనుకుంటే, గతంలో మీరెటువంటి ఫలితాలు అనుభవించారో అటువంటి ఫలితాలే అనుభవిస్తారు. 144 శెక్షనును తగ్గించి, మంత్రులు తగిన చర్యతీసుకుంటారో, లేక కమిటీనివేసి విచారణ జరిపిస్తారో ఏదో ఒకటి వెంటనే చెయ్యాలని కోరుతున్నాను.

Sri A. NEELADRI RAO REDDI:— అధ్యక్షా, డిస్ట్రిక్టు ఎడ్మినిస్ట్రేషన్ డిమాండును బలపరుస్తూ కొన్ని సూచనలు చేయదలచాను. మిత్రులు చాలామంది అనేక సూచనలు చేశారు. ఆఫీసులలో efficiency ని గురించి ముఖ్యంగా చెప్పవలసివుంది. District administration లో efficiency బాగాలేదని మిత్రులు చెపుతున్నారు. దానికి కారణం ఏమిటి? మొదటి కారణం ఏమంటే non-gazetted officers కు చాలా తక్కువజీతాలు యిస్తున్నారు. Central Pay Commission వారు జీతాల విషయంలో కొన్ని సూచనలు చేశారు. వారి సూచనల ప్రకారం యివ్వనందువల్ల, రాష్ట్రంలోవున్న non-

gazetted officersలో అసంతృప్తి బాగా పెరిగింది. దానిని తగ్గించడానికి ప్రభుత్వం వెంటనే చర్యతీసుకోవాలి. రాష్ట్రంలో unit of administration గ్రామాలలోనే వుంది. ఇది రెవెన్యూబోర్డులోనో, మరొక చోటో ఉందనుకోవడం పొరబాటు, రెవెన్యూ మంత్రిగారు చెపుతూ, village officers చాలామంది వున్నారు. వాళ్ళకు ఎక్కువ జీతాలు యిద్దామనే వుందికాని, ఆర్థికంగా అది కష్టంకాబట్టి చేయలేమేమో అంటున్నారు. Units of administration లోనే మీరు సవరణ చెయ్యలేనప్పుడు మీరింక ఏమిచెయ్యగలరు? అది సవరణచేస్తేనే administration బాగుంటుంది. ఉపాధ్యాయులుకూడా చాలా అధ్వాన్న స్థితిలో వున్నారు. వాళ్ళకు సరిగా తినడానికి తిండి, కట్టడానికి బట్ట చాలక బాధపడుతున్నారు. వాళ్ళు కడుపునిండా తిండి లేకపోతే ఏమి పని చెయ్యగలరు?

సభ్యులు మాట్లాడుతూ Confidential report ను గురించి చెప్పారు. ఇది చాలా అవసరం. కాని వాటికి సంబంధించిన నిబంధనలు మాత్రం మార్చాలి. లేకపోతే వాళ్ళ మంచిచెడ్డలు వాళ్ళు తెలుసుకోడానికిగాని, వాటిని సవరించుకోడానికిగాని అవకాశం వుండదు. వాళ్ళ తప్పులు వాళ్లు తెలుసుకున్నప్పుడే వాళ్లు efficient గా పని చెయ్యగలరు.

Transport విషయంలో కొన్ని అసందర్భాలున్నాయి. బస్సులు సస్పెండు చెయ్యడంగాని, లైసెన్సులు రద్దుచెయ్యడంగాని జరిగినందువల్ల ప్రజలకు చాలా యిబ్బందులు కలుగుతున్నాయి. ప్రజలకు అసౌకర్యాలు కలగకుండా సవ్యమైనమార్గం ఆలోచించాలి. శ్రీకాకుళం జిల్లాలో ఒరిస్సా బార్డరులో పర్లాకిమిడి, కోరాపుట్టి Central places గా వున్నాయి; కాని అక్కడ R. T. O. లు బస్సు యజమానులకు లైసెన్సులు యివ్వడంలేదు. దానివల్ల ప్రజలకు చాలా యిబ్బందిగా వుంది. ఈ విషయం R. T. O. ల దృష్టికి నేను తీసుకువచ్చాను. కాని లాభం జరగలేదు.

ఆ తరువాత, ఈ బస్‌లకు licence లు యివ్వడంలోను, bus routes ను యివ్వటంలోను R.T.O. లు adminisrtative officers

గా పనిచేస్తున్నారు. చాలాగుండ ప్రజలు ఈ routes కావాలని చెప్పి R. T. O. కు apply చేయటం జరిగింది. అప్పుడు ఆ R. T. O. గారు అంగీకరించనిరాకరించడం జరిగింది. అందువల్ల ప్రజలకుప్రయాణసౌకర్యములు వుండుటలేదు. చాలా యిబ్బంది పడుతున్నారు. ఈ విషయమును పరిశీలించవలసినదనిచెప్పి ప్రభుత్వానికి నేను సూచిస్తున్నాను. తరువాత మా శ్రీకాకుళం జిల్లాలోని ఇచ్ఛాపురంలోవుండే Sub-Magistrate Court తీసివేయడం జరిగింది. అచ్చట Sub-Magistrate Court లేకపోవడంవల్ల ప్రజలు చాలా యిబ్బందిపడుతున్నారు. అందుచేత ఇచ్ఛాపురంలో ఒక Sub-Magistrate Court పెట్టవలెనని కోరుతున్నాను. అక్కడ కనుక Sub-Magistrate Court పెడితే ఆ ప్రాంతపు ప్రజలకు అందుబాటులోవుండి చాలా సౌకర్యంగా వుంటుంది. తరువాత మా తాలూకా ఉద్దానం ప్రాంతంలో మంచినీటి వసతి అసలే లేదు. అచ్చటిప్రజలంతా మంచినీరులేక చాలాబాధపడుతున్నారు. అచ్చట మంచినీటి నూతులు త్రవ్వించుట అత్యవసరము అని మనవిచేస్తున్నాను. కోటిరెడ్డిగారు ఈ విషయమై తగుచర్యలు వెంటనే తీసుకోనవలయునని కోరుతున్నాను. ఆ ప్రాంతములలో ప్రజలు నీటికొరకై ఏ విధంగా బాధపడేది విశ్వనాధంపంతులుగారికి కూడా తెలుసు. ఇచ్ఛాపురంలోని ఉద్దానంలో ఒకచోట నూతిని త్రవ్వుతూ, 60 అడుగులలోతు త్రవ్వినా కాని నీరు రాలేదు. అందువల్ల ప్రభుత్వం ఈ విషయమై వెంటనే తగు చర్యలు తీసుకోవలసిందిగా మరల కోరుతున్నాను. ఇక generalగా District Administration లో లంచగొండితనము చాలా ప్రబలిపోయింది. ముఖ్యముగా Prohibition Department లో లంచగొండితనం ఎక్కువగా వున్నది. లంచగొండితనము వుండడంవల్ల ప్రభుత్వం సక్రమంగా నడవడం కష్టం. ప్రజలకా యిబ్బంది కలుగుచున్నది. అందువల్ల ప్రభుత్వం C. I. D. లను నియోగించి ఈ లంచగొండితనమును అరికట్టడానికి ప్రయత్నించాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri PRAGADA KOTAIAH:- అధ్యక్షా! జిల్లాలలో వివిధ శాఖలకు వివిధఅధికారులున్నారు. అయితే వారుజిల్లాకుసంబంధించినఅన్ని కార్యక్రమములను, సంప్రదించుకొని వివిధ సమస్యలను పరిష్కరించవలసిన

చేయవలసిన అవసరం చాలావుంది. నాకు జిల్లాల్లోవున్న అధికారులు చాలా తరచుగా సమావేశమై అవసరమైన సమస్యలను చర్చించుకొని, సత్వరమే పరిష్కరించడానికి వీలుగా [illegible] ప్రభుత్వం ప్రోత్సహించటంలేదు. ఇలా ప్రతినెలయందొకసారి జిల్లా అధికారులంతా సమావేశమై సంప్రదించుకొని వారి పరిపాలనలోవున్న సమస్యలు [illegible] కుంటే అవి సక్రమముగా పరిష్కరింపబడటానికి అవకాశం వుంటుంది. ఇప్పుడు Food Production Committee లు వున్నట్లుగా Irrigation Conference లు జరుగుతున్నట్లు అన్ని విషయాలలో — జిల్లా అధికారులు సమావేశమై సంప్రదింపులు జరిపినట్లయితే అన్ని సమస్యలను త్వరలోనే సక్రమంగా పరిష్కరించవచ్చు. నెలకొకసారి జిల్లాలోవున్న వివిధ శాఖాధికారులు కలుసుకొని వారివారి సమస్యలను పరిష్కరిస్తూవుండాలి. Periodical conference లు ఏర్పరచడంలో ప్రభుత్వం ఎందుకు యింత జాప్యం చేస్తోందో నాకు అర్థంకావడంలేదు. ఈ అధికారులు క్రింది గుమాస్తాలు వ్రాసిన నోట్లకు yes అని ఆమోదించడం జరుగుతోంది. చిన్నచిన్న గ్రామకరణాలు ఎలాగ వ్రాస్తే అలాగ వ్రాం చేస్తున్నారు. గ్రామ కరణములు వ్రాసిన నోటును Deputy Tahsildar, తరువాత Deputy Collector District Collector, కూడా చూచి yes అని పడవేస్తూంటారు. వీటిని ప్రత్యేకంగా సబ్ కలెక్టర్లు, జిల్లా కలెక్టర్లుకూడా స్వయంగా చూచి యేవిషయాన్నైనాసరే స్వయంగా పరిశీలించడానికి ఎక్కడా శ్రద్ధతీసుకోవడం లేదు. అందువల్ల పనులుసక్రమముగా జరగడంలేదు. వారు filesను స్వయంగా పరిశీలించినట్లయితే వారికి అసలు అందులోగల విషయము లేమిటో, అందలిలోటుపాట్లేమిటో తెలుస్తాయి. గుమాస్తాలు ఏవో కొన్ని విషయాలు రాసేటప్పటికి వాటిని మాత్రమే చూసి yes అని రాయటమో, లేకపోతే వానిపై ఏవో remarks రాయటమో జరుగుతోంది. గుమాస్తాలు రాసినదానిని ఒప్పుకోవటంతో, గుమాస్తాలలో అవినీతి, లంచగొండితనం హెచ్చయిపోయాయి. గుమాస్తాలు వారికి ఇష్టమొచ్చినట్లుగా వ్రాస్తే దానిని వీరు పాస్ చేయడం జరుగుతున్నందువల్ల వారు పనికావలసిన వారివద్దనుంచి 10 రూపాయలో, 15 రూపాయలో లంచం తీసుకొని వారికి అనుకూలంగా వ్రాయడం జరుగుతోంది. ఈవిధంగా క్రింది గుమా

అమలుజరపలేదు. అసలు ఒక సంవత్సరంనుంచి ఆ కాగితం ఎక్కడ ఉందో కూడా ఎవరికీ తెలీదు. Chief Engineer కు D. O. లు వ్రాసినాను, Superintending Engineer కు D. O. లు వ్రాసినాను; కాని ఈ విషయం గురించి ఇంతవరకు ఏమీ చర్యలు తీసుకోవడం జరగ లేదు. జిల్లా పరిపాలన ఈ విధంగా ఉన్నది. అధికారులేమాత్రం శ్రద్ధవహించడంలేదు. జిల్లా పరిపాలను సక్రమంగానడుపుటకు జిల్లాలలోని Departmental Heads మధ్య పరస్పర సహకారభావము లేనందువల్ల ఈ విధంగా పనులు జరుగుటలేదు. ఈ విధంగాఉంటే ఈ ప్రభుత్వం మీద ప్రజలకు విశ్వాసం ఎలావుంటుంది? జిల్లాలోని Departmental Heads అంతా కలిసి సమావేశమై సంప్రతించుకొని, అన్నివిషయాలను సమన్వయపరచుకొని వాటిని పరిష్కరించడానికి పూనుకోవాలి. అలాగ చేసినట్లయితే ప్రజలకు అన్ని సౌకర్యములను కలిగించి వారికి సహాయ పడడానికి అవకాశం ఉంటుంది. అందువల్ల జిల్లాలలోని వివిధ శాఖాధి కారులంతాకలిసి coordination తో పనిచేయాల్సినదిగా ఇప్పుడైన ప్రభుత్వం ఏర్పాటుచేయాలి. తరువాత Harijans కు house sites యివ్వడం విషయంలో 75 వేల మందికి ఇండ్ల వసతి కల్పించామని అన్నారు. ఈ హరిజనులకు యిండ్లస్థలాలను యివ్వటానికి జిల్లాకలెక్టర్లు ఇదివరలోభూములను కేటాయించేవారు. కాని ఈ Harijan Welfare Officers వచ్చిన తరువాత హరిజనులకు ఇండ్లస్థలాలను వీరు కేటాయించ వలసి వస్తున్నది. జిల్లాలలోహరిజనాభివృద్ధి ప్రణాళికలు అంతగాఏమీలేవు. ఆ ఇండ్ల స్థలాలకు ఎవరుఅర్హులో అనేటువంటిది చూడకుండానే ఈ స్థలము లను కేటాయించడం జరుగుతోంది. వీరు జిల్లాలలో అభివృద్ధి ప్రణాళికలను విరివిగా అమలు జరపటానికి పూనుకోవడంలేదు. అక్కడ ఈ Harijan Welfare Department వారు హరిజనాభివృద్ధికై ఏమాత్రం కృషి చేయుటలేదు. కొన్నికొన్ని చోట్ల వారు పనిచేసినా చేయకపోయినా, వారిని అలాగే ఉంచడం జరుగుతోంది. మొత్తంమీద యిపుడు జిల్లా పరి పాలన జరిగే విధానంవల్ల ప్రజలకు ఏమాత్రం ప్రయోజనంలేదు. ఈ జిల్లా పరిపాలనలో ప్రతిశాఖలోని ఉద్యోగులు లంచగొండితనానికి, అవి నీతికి పాల్పడుతున్నారు. కొంతమంది ఉద్యోగులవద్దకు శాసనసభ్యులే పోయి, వారికి లంచములిచ్చి పనులుచేయించి వారుకూడా లంచములు పుచ్చుకుంటున్నారు. ముఖ్యంగా ఈ లంచములు ఎక్కువగా Revenue

Sri K. V. Ramesam] [17th March 1954

వుంది. ముఖ్యంగా ఇంజనీరింగు డిపార్టుమెంటును, రెవెన్యూ డిపార్టు మెంటును సమన్వయపరచక పోవడంవల్ల ఏ స్కీము చూసినా staff లేదు అనో, record రాలేదు అనో complaints ఎక్కువగా వస్తున్నాయి. అటువంటి ఆలస్యం లేకుండా జిల్లాలోని ఆఫీసర్లకి మాసానికి ఒకసారి conferences ఏర్పాటుచేస్తున్నారు. కాని వీటివల్ల substantial గా ఏ పని జరగడంలేదు. అందుచేత డిపార్టుమెంటులు అన్నీ కలిసి కట్టుగా పనిచేసేవిధాలంగా నిబంధనలు మార్పుచేయవలసివున్నది. ఈ విషయంలోకూడా గవర్నమెంటు శ్రద్ధవహించి delay లేకుండా అవసరమైనమార్పులు చేయాలి అని కోరుచున్నాను.

Sri G. JOSEPH:—అధ్యక్షా, ఈ జిల్లా పరిపాలనా విధానాలు సక్రమంగా జరగడంలేదని నేను cut motions ను బలపరుస్తున్నాను. రేపల్లె తాలూకాలో కొన్ని సొసైటీ లంకభూములు వున్నాయి. 30 సంవత్సరాలనుంచి హరిజనులు సొసైటీ ద్వారా సాగుచేస్తున్నారు నాలుగు ఏండ్లక్రింద 727 నంబరు భూమి 20 ఎకరాలు క్రిష్ణలో తేలింది. గ్రామమునసబు ఆక్రమించి దానిని పట్టా భూమి అని సాగుచేసాడు తరువాత సంవత్సరానికి సొసైటీవాళ్ళు అది పట్టాభూమికాదని గవర్నమెంటు భూమిఅని తెలుసుకొని తిరిగి ఆక్రమించారు తరువాత మునసబు భూస్వాములను కొందరను వెంటతీసుకొని హరిజనుల నందరిని తొలగించి ఆక్రమించుకొన్నాడు. దానిమీద నేను డిప్యూటీకలెక్టరు దగ్గరకు రాయబారంపోవడం జరిగింది. సొసైటీవాళ్ళను మునసబుముఠావాళ్ళు తలకాయలను బద్దలుకొట్టించడంవరకు జరిగింది. ఇప్పుడు ఆభూమి విషయంలో తాసిల్దారు, డిప్యూటీ కలెక్టరు evict చెయ్యాల్సిందిగా రిపోర్టువ్రాసిపంపిస్తే జిల్లాకలెక్టరుకు మళ్ళీ రెవెన్యూబోర్డు stay order ఇచ్చి 22-12-53 న దానిని రద్దుచేస్తూ ఎవిక్షను ఖాయ పర్చినది. పైరు ప్రభుత్వం స్వాధీనంచేసుకొని వేలం వెయ్యాలని తెనాలి డిప్యూటీకలెక్టరు ఉత్తర్వుచేశారు. రెవెన్యూసెక్రెటరీ కలెక్టరును తిరిగి [illegible] పంపవలసినదిగా వుత్తర్వులు పంపడం జరిగింది. Board standing orders నుకూడా ఈసెక్రెటరీ ధిక్కరించి తిరిగి రిపోర్టుపంపించమనడం చాలా అన్యాయం. పేదప్రజలు సాగుచేసుకొనే భూమినుంచి వారిని తొలగించడానికి 5 నిమిషాలుపట్టదు. కాని భూస్వాములకు రక్షణ

కలిగించటానికి ప్రభుత్వం ఎంతో శ్రద్ధకనబరుస్తోంది. పేదలవిషయములో శ్రద్ధ వహించడంలేదు. గొంపవరములో పెద్దపెద్ద భూస్వాములు. చంద్ర మౌళిగారి చుట్టాలకు, అనుచరులకు 360 ఎకరాలదాకా భూమి [illegible] పెట్టింది ప్రభుత్వం. పేద ప్రజానీకంనుండి లాక్కుని [illegible]చేసుకొంటే దానికి భూస్వాములకు రు 30.000 దాకా ప్రభుత్వం [illegible] సందర్భంలో market rate కు వేలం వేస్తాం అని [illegible] చారు. దానిమీద పేదప్రజానీకం మంత్రుల దగ్గరకు రాయబారం వెడితే ఈ సంవత్సరానికి stay చేసాము, మామూలుగా lease కు ఇస్తా మని మంత్రులు వాగ్దానంచేసారు.

రాష్ట్రంమొత్తంమీద కాకుండా ప్రత్యేకంగా గుంటూరు జిల్లాలో కలెక్టరు పేద ప్రజలకు అన్యాయంచెయ్యడానికి ఇటువంటి ఆర్డర్లు వేస్తే, మేము మంత్రులవద్దకువస్తే ఈ సంవత్సరంకాదు next year ఏమైనా చూస్తామని చెప్పడం సరికాదు. దోనెపూడిలో హరిజనులకు సొసైటీ వుంది. చంద్రమౌళిగారు వారి అనుచరులు కదిహేను మందితో ఒక సొసైటీ ఏర్పాటుచేసేరు. దానికి క్రిష్ణాగారు ప్రెసిడెంటు. వారు ఈమని, పెనమర్రి గ్రామస్థులతో బోగస్ సొసైటీని ఏర్పరచారు. ఆ భూమియంతా క్రిష్ణా ఒక్కడే అనుభవిస్తున్నాడు, ఈ భూమిని హరిజన పేజంట్సు కో ఆపరేటివు సొసైటీవారు అనుభవిస్తుండేవారు. ఇదివారికి ఇవ్వడం చాలా న్యాయం. రాలికంపాడు 312 నెంబరు భూమిని రాజకీయ బాధితుడిక యిచ్చారు. దొంగ సర్టిఫికేటు పుట్టించి ఈ భూమిని ఆయన కాజేసాడు. ఈ భూమిని గొల్లపూడి సామ్యేలు 10 సంవత్సరాలనుండి సాగు చేస్తు న్నాడు. ఎవిక్షను ఆర్డరు అయినా ఇవ్వకుండా యీ భూమి తీసుకున్నారు. అనంతవరంలో నాగళ్ళ కుటుంబయ్యకు 12 ఎకరాలు పట్టాభూమి వుంది. తెనాలి తాలూకాలో ఎకరా సుమారు 6000 అయినా ఖరీదుచేస్తుంది. ఆయనకు కలెక్టరు చెరువు పొరంబోకు యిచ్చేడు. ఆభూమి కళ్ళగుంట పిచ్చయ్య 47 సంవత్సరములనుండి సాగు చేస్తున్నాడు. ఈ సంవత్సరం పిచ్చయ్య తనపైరు కోసుకొచ్చాడు. నాగళ్ళ కుటుంబయ్య అను రాజ కీయ బాధితుడు దావులూరు సబ్ యిన్స్పెక్టరుగారికి లంచము యిచ్చి పిచ్చయ్యకు కోతకువెళ్ళిన చిరుమూరుపల్లె హరిజనుల యిండ్లపై దాడి చేయించి వాళ్ళయిండ్లలో ధాన్యము అంతా విరజిమ్మించారు. అంతే

డానికి ప్రభుత్వం పూనుకొంటుందని నేను ఆశించుచున్నాను. ఉదాహరణకు జిల్లాలో పరిపాలనకు కలెక్టరువున్నారు. క్రింద తాలూకాలలో తహశీల్దారులచేత పనులు నిర్వహింపబడుచున్నవి. ఈ మధ్యను ఈ డివిజనులు ఆఫీసర్లను ఏర్పాటుచేసి అనవసరముగా వ్యయముచేస్తున్నారు. వారికి executive power చాలా విషయాలలో తక్కువ. ఉదాహరణకు చెప్తున్నాను. బనగానపల్లె తాలూకాలో క్షామము 1952 లో వచ్చినప్పుడు వడ్డెవారు తిండిలేక రాతిగనులలో పనిచేసుకొనుటకు లైసెన్సు ఇవ్వమని డబ్బు కట్టుకొంటామంటే ఏమీ చెయ్యలేకపోయినారు. ప్రభుత్వానికి మహాజర్లు పంపితే రెండు సంవత్సరాలనుంచి action ఏమీ తీసుకోలేదు. నేను స్వయముగా R. D. O. తోను తహసిల్దారుతోను మాట్లాడినాను. ఆకాగితము తహసిల్దారు ఆఫీసులోనే పడివుంది. తనకు అధికారములేదని ఆయన అన్నాడు. R. D. O. క్రొత్త ఆయనకాబట్టి ఆర్డరువేసేఅధికారం నాకు ఉందో లేదో తెలియదు అన్నారు. అట్టి అధికారంవుంటే వెంటనే, లేకుంటే కలెక్టరు అనుకూలంగా సిఫారసు చేస్తానని అన్నాడు. తహసిల్దారుగారు మీకు అధికారంలేదు మైనింగు విషయములో కలెక్టరుగారే ఆర్డర్లు వెయ్యవలెనని R. D. O. గారికి చెప్పేరు. 1½ సంవత్సరాలు అయినా ఇప్పటికీ ఆర్డర్లు ఏమీరాలేదు.

నిరర్థకముగా యిన్నిలక్షల ద్రవ్యాన్ని ఖర్చుపెట్టి అధికారాన్ని అమలుజరుపడానికి వీలులేకుండ అన్ని అధికారాలు Collectors చేతుల్లో కేంద్రీకృతము అయినపుడు ఎందుకు యీ R. D. O లు. కేవలము post offices మాదిరిగానే ఇవి పనిచేస్తున్నవి. ఈ R. D. O. ఆఫీసులు అనవసరముగా వున్నాయి. ప్రత్యక్షమైన వుపయోగము ప్రజలకు మాత్రములేదు. ఈ top heavey administration ప్రజల డబ్బు నిరర్థకముగా ఖర్చుచేస్తున్నది. ఈ R. D. Os. ను రద్దుచేసినట్లయితే ఎంతో ద్రవ్యము కాపాడుకోడానికి అవకాశము వుంటుంది. ప్రభుత్వానికి ఆదాయము వచ్చే cases లో Collector గారు order తొందరగా ప్యాసుచేయకుండా ఎందుకు వేచియుండాలో తెలియదు. తహసిల్దార్లకు అధికారాన్ని వికేంద్రీకృతముచేస్తే ఇటువంటి అనవసరమైన ఖర్చు తగ్గుతుంది. అందుకుగాను R. D. Os. రద్దుచేయాలని ప్రభు

త్వానికి సూచిస్తున్నాను. Estates విషయములో చాలా అన్యాయాలు జరుగుతున్నాయి. మా పార్టీ మెంబరు శ్రీ వెంకట కూర్మి నాయుడుగారు బొబ్బిలిలో ఇంకా ఇదివరకటి జీతాలే ఇస్తున్నారు అన్నారు. Estates ను రద్దుచేసి వాటిని మనప్రభుత్వం స్వాధీనముచేసు కున్నప్పటికీ మనజీతాలివ్వటంలేదు రిటైరుఅయిన తరువాత pension లు కూడా యిచ్చే సదుపాయాలులేవు. ఇది శోచనీయం. నేను కాంగ్రెసులో వున్నప్పుడు బనగాన పల్లెకువెళ్ళి అక్కడి ప్రజలకు మీరు గనుక మాలోచేరితే మీకు మాకున్న సదుపాయాలు లభిస్తాయని ప్రచారము చేసేవాడను. Estates లో గ్రామోద్యోగులకు 7 రూపాయలు యిస్తూవుంటే మన Indian Union లో 21 రూపాయలు యిస్తున్నారు. ఇంతవరకు యిక్కడవున్న జీతాలు estates లో యివ్వడానికి పూనుకోలేదు. ఇకపోతే తూకాలు కొలతలు ఉన్నాయి. వాటికోసము 18800 రూపాయలు ఖర్చు అవుతుంది. ఒక ప్రదేశములోను మరొక ప్రదేశములోను తూకాలు, కొలతలు వేరుగావుండడముచేత అనవసరఖర్చు అగుటయును రవాణా సౌకర్యాలకు యిబ్బందులు కలుగుటయు సంభవించును. ఒక తాలూకాల్లోవున్న కొలత మానికలు ఇంకొక తాలూకాలోని కొలత మానికలు వేర్వేరుగావుండును. బనగాన పల్లెలో బస్తా 64 పళ్ళంటే నందికొట్కూరులో బస్తా 50 పళ్ళుమాత్రమే. అందుకని అన్నిప్రాంతాలలోను యీ మానికలు ఒకేవిధముగా వుండాలని ఆసిస్తున్నాను. ఆఖరు విషయమేమంటే anti malarial operations గురించి కర్నూలుజిల్లాలో అనేక ప్రాంతాలలో ప్రజలు మలేరియాతో చాలా బాధపడుతున్నారు. చాలా గ్రామాలు యీమ బాధకు గురి ఔతున్నాయి. కొన్ని గ్రామాలు సిథిలావస్థలో వున్నాయి. ఈ మలేరియా బాధనుంచి రక్షిస్తేతప్ప గ్రామాలువదలి పోవలసి వుంటుంది. ప్రజలు అనేక కష్టాలకు గురిఔతున్నారు. పత్తికొండ తాలూకాలో అనేక గ్రామాలు యీ బాధకు గురిఔతున్నవి. ఈ బాధకు గురియైన గ్రామాల అభివృద్ధికొరకు ప్రభుత్వము కృషిచేయాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri. D. RAMABRAMHAM:— అధ్యక్షా, ఇపుడు మన ఎదుటవున్న District Administration Demand ను support

చేస్తూ ప్రభుత్వానికి కొన్ని సూచనలుచేస్తున్నాను. ఇప్పుడు జిల్లా పరిపాలనా విధానము చాల లోప భూయిష్టముగా వుంది. ఇప్పుడు జరుగవలసినటువంటి administrative వ్యవహారాలు Officers చేతులలో వుండడంవల్ల జిల్లాలోవున్న ఆఫీసర్లు వారి యిష్టానుసారముగా కార్యక్రమాలు చేస్తున్నారు శాసన సభ్యులు సూచించిన ప్రకారం పనులు మాత్రము సాగవు. కాని local గా వున్న ఉద్యోగుల ఇష్టప్రకారం పనులు సాగిపోతూ వుంటాయి. జిల్లాబోర్డులను రద్దుచేసి తాలూకా బోర్డులను పెట్టే సూచనలు ఎక్కడా కనబడడములేదు. శాసనసభ్యులతో కూడిన ఒక Advisoary Board ను ఏర్పాటుచేసి కొందరిని non-officials ను తీసుకొని శాసన సభ్యులను అక్కడవున్న స్థానిక జిల్లా officers తో మూడు మాసాలకు ఒక్క సమావేశము జరిపే జిల్లాలో జరగవలసిన కార్యక్రమమును వారి సలహాల ప్రకారముచేస్తే బాగుండునని చెప్పి ప్రభుత్వము వెంటనే తగిన శాసనముచేసే అవకాశాన్ని కల్పించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఇప్పుడు శాసనసభా నియోజకవర్గాలను delimit చేసి ప్రత్యేక నియోజకవర్గాలను ఏర్పరుస్తున్నారు. ఆ ప్రకారం ప్రతి యొక్క తాలూకాను కేంద్రముగాచేసి ఆ తాలూకాలో కావలసిన సదుపాయాలు కలుగచేయాలి. అదీ కాకుండా ఇప్పుడు abolition of zamindars అయిన తర్వాత జమీందారీలలోవున్న ప్రజలకు ప్రభుత్వానికి సంబంధములేకుండ వున్నది. వాండ్లను ఆలాగే వదలివేస్తున్నారు. మా చిత్తూరు జిల్లాలో కుప్పంలో 360 గ్రామాలు జమీందారి area లో వున్నవి. అది ప్రత్యేక తాలూకాగా వున్నప్పటికి అక్కడ తాలూకాకు ఒక తహసిల్దార్ office గాని treasury గాని లేకుండ అవస్థపడుతున్నారు. ప్రతి వ్యవహారముకూడ treasuary తో సంబంధమువుంది. తాలూకా office తో సంబంధము వుంటుంది. కాబట్టి దానిని వెంటనే ప్రత్యేక తాలూకా కేంద్రముగా ఏర్పాటుచేసి treasury ఏర్పర్చాలి. పలమనేరుకు పోవాలంటే 60 మైళ్ళుపోయి 60 మైళ్ళు రావలసి వస్తుంది. తలార్లు జీతాలకొరకుగాను 60 మైళ్ళు నడచి పోవాలి. దారిలో చోరీ జరిగినాకూడ తలారిపై భారము పడుతుంది. అటువంటివి జరుగకుండా ఏర్పాటుచేయాలి. ముఖ్యముగా గ్రామో

Sri D. Ramabramham] [17th March 1954

ద్యోగులకు చాలా తక్కువ జీతాలు యిస్తున్నారు. అక్కడికి వచ్చే officers ను మేపవలసిన భారము వారిపైపడింది. వారిజీతము స్వల్ప ము కాబట్టి ఆ గ్రామములోని ప్రజలపై ఒత్తడిచేసి ఇటువంటి officers ను తృప్తిపరచడానికిగాను ప్రయత్నాలు చేయవలసివుంటుంది.

గ్రామ కరణాలకు, మునసబులకు అనేకమంది పెత్తందార్లు అయి పోయారు. ఒక్కొక్క తాలూకాకు అనేకమంది తహశీల్దార్లు బైలు దేరారు. యుద్ధము ముందు ఇంతమంది లేరు. యుద్ధము అయిన తరు వాత ఎక్కువ ఆఫీసర్లు అయినారు. యీ గ్రామ వుద్యోగస్తులపైన ఆధారపడి వారి యిష్టంవచ్చినట్లుగా వస్తూవుంటారు. ఈ ఆఫీసరులు గ్రామకరణం, మునసబుల యెడల తగినటువంటి మర్యాదలను చూపటం లేదు. ఇది ప్రజాప్రభుత్వం. బ్రిటిష్ వారి కాలములో, గాంవంగా పనులు జరిగినవి. ఇప్పుడు ప్రజాప్రభుత్వం వచ్చినా మన అఫీసర్లవద్ద మర్యాద లేకుండాపోయింది. ఈ ఆఫీసర్ల విషయంలో, గ్రామాలలోని వారు చాలా నిరుత్సాహం చూపుతున్నారు. కాబట్టి యీ విషయ ములో ప్రభుత్వం తగిన చర్యలు తీసుకొని, వుత్తర్వులు యివ్వవలసినదిగా కోరుచున్నాను. చాలా మారుమూలల గ్రామాలలో వైద్యసౌకర్యములు లేక ప్రజలు చాలా యిబ్బందులు పడుతున్నారు. చిత్తూరు జిల్లాలో పుత్తూరు తాలూకాలో చాలా గ్రామాలలోని ప్రజలు వ్యాధులచే బాధ పడుచున్నారు. కుష్టువ్యాధి మొదలైన జబ్బులు విపరీతముగా పెరిగి పోయినవి. మేము ఆ ప్రాంతాలకు వెళ్ళినప్పుడు భోజనము చేయటానికి కూడ భయపడ్డాము. అటువంటి గ్రామాలకు తగిన వైద్య సౌకర్యాలు చేయాలని కోరుతున్నాను. ఎక్కువగా ఆసుపత్రులు నిర్మించటానికి సాధ్యంకాక పోవచ్చును. ప్రస్తుతానికి mobile vans ద్వారానైనా ఆ గ్రామాలకు వైద్యసౌకర్యాలు చేయించాలని కోరుతున్నాను. ప్రత్యేకంగా తాలూకా కేంద్రాలలో, male doctor తో పాటు ఒక lady doctor కూడా ఉండాలి. Lady doctor పొరుగూళ్ళకు వెళ్ళకపోయినా, కేంద్రములోవుంటూ ఆసుపత్రి administration చేస్తూ వుంటుంది. Male doctor చుట్టు ప్రక్కల గ్రామాలకువెళ్లి అక్కడ కావలసిన మందులను యిస్తూ ఆ గ్రామాలవారికి వైద్య

సౌకర్యము చేస్తూ వుండవచ్చును. ఇప్పుడున్న ఆసుపత్రులలో శిశుసంరక్షణ శాలలను కూడ ఏర్పాటు చేసినవాళ్లు training పొందిన mid-wife లను వుంచాలి. Lady doctor లేనిచోట male doctor తో ప్రసూతి చికిత్సను చేయించుకొనుటకు గర్భిణీ స్త్రీలు ఒప్పుకొనకపోవటంచేత వాళ్ళు చాలా తంటాలు పడుతున్నారు. మన ప్రజా ప్రభుత్వం వచ్చిన తరువాతనైనా, lady doctorsను నియమించి, తగిన వైద్యసౌకర్యం చేయవలెనని కోరుతున్నాను. Lady doctors లో చాలామంది ప్రభుత్వ ఆసుపత్రులకు రావటానికి మానుకుంటున్నారు. వారికి ప్రయివేటు ప్రాక్టీసులోనే ఎక్కువ రాబడివున్నది. వారికికూడ male doctors కు యిచ్చే జీతాలకంటె ఎక్కువ స్కేలు యిచ్చి ప్రభుత్వం నియమించవలసినదిగా కోరుచున్నాను.

Harijan uplift పద్దుకు 56 లక్షలు allot చేశారు. ఉద్యోగస్తుల జీతాలకు, వారి ప్రయాణఖర్చులకు 14 లక్షలు, Harijan uplift కు 14 లక్షలు, యీవిధంగా యీ డబ్బుఅంతా యీ వుద్యోగస్తులను మేపటానికే పోతున్నది. వుద్యోగస్తులంతా జీప్ కార్లలో తిరుగుతూ, యీ విధంగా యీ డబ్బు దుర్వినియోగము చేస్తున్నారు. ఇట్లాకాకుండా, వీరి కార్యకలాపాలపై పర్యవేక్షణ ఏర్పాటుచేస్తే బాగుంటుంది. కాబట్టి గవర్నమెంటువారు, యిందుకు తగుమైన చర్యలు తీసుకోవాలని కోరుతున్నాను.

ఇప్పుడు నీటివసతులకు ఏర్పాటైన భావులు చాలా హీనస్థితిలో వున్నాయి. యీ భావులను చూచి గవర్నమెంటు భావులని చెప్పవచ్చును. అక్కడి కంట్రాక్టర్లు వుద్యోగస్తులతో ఏకమై ఎక్కడ బండలు, రాళ్ళు వుంటాయో అక్కడ భావులు త్రవ్వుతూ ఎక్కువ డబ్బును ఖర్చుపెట్టుతున్నారు అట్లాగాక, ఆ గ్రామములోని, మునసబు, కరణాలను సంప్రదించి ఏ చోట తక్కువ వ్యయముతో నీళ్ళు వస్తాయో, అక్కడ భావులు త్రవ్వించటానికి తగు చర్యలు తీసుకొనవలసినదని ప్రభుత్వదృష్టికి తెస్తున్నాను. ఇప్పుడు elementary school teachers కు చాలా తక్కువ జీతాలు యిస్తున్నారు. వీరి విషయములో చాలా పొరబాటు చేస్తున్నారు. ప్రాథమిక విద్య మనదేశానికి కావలసిన

Sri D. Ramabrahmam]  [17th March 1954

విద్య. వీరికి తగిన జీతాలు యివ్వాలి. సెకండరీ గ్రేడు ప్యాసయినవారు ఎలిమెంటరీ స్కూళ్ళలోవుంటే, తక్కువ జీతమున్నా, high schools లో వుంటే ఎక్కువ జీతమిస్తున్నా యిస్తున్నారు. అందరికీ ఒకే విధంగా యివ్వాలని కోరుతున్నాము. వీరికి జీతాలు తక్కువని వీరు వుద్యోగాలకు రావటం మానివేస్తున్నారు. కాబట్టి యీ elementary education అభివృద్ధి చేయడానికి ప్రభుత్వం తగిన చర్యలను, తీసుకొనవలెనని కోరుచున్నాను.

జమీందారీ ఏరియాలలో రైతులకు చాలా యిబ్బందులువున్నవి. జమీందారీ ప్రాంతములలోవున్న బావులను, చెరువులను తణిఖీచేసి, వాటికి తగిన మరమ్మత్తులు చేయడానికి తగిన staff లేదు. కాబట్టి యిప్పుడు, యీ జమీందారీ area కు యిద్దరు సూపర్‌వైజర్లను ఏర్పాటు చేయవలసినదిగా కోరుతూ యింతటితో ముగిస్తున్నాను.

* Sri P. PUNDARIKAKSHACHARYULU :— ఈ పద్దుపైన కోత తీర్మానమును బలపరుస్తూ ఈ క్రింది విషయాలు చెప్ప దలచుకొన్నాను. District Administration and Miscellaneous అన్న పద్దు చాలా ప్రాముఖ్యమైనది. ఇది అన్ని departments కు సంబంధించినది. దీనిని గురించి రివిన్యూమంత్రిగారు చెప్పారు. కాని యింతటి ప్రాముఖ్యమైన పద్దు చర్చ జరుగుతున్నప్పుడు మిగతా మంత్రులు యిక్కడ లేకపోవడం చాలా విచారకరమైన విషయం. Miscellaneous వాటిక్రింద వచ్చే మిగతా departments కు సంబంధించిన వాటి విషయములో శ్రీ విశ్వనాథంగారు ఇక్కడవుండి, యీ చర్చలలో పాల్గొనటం చాలా సంతోషమైన విషయం. తరువాత యీ జాబితాలలో శ్రీ విశ్వనాథంగారి portfolio కు సంబంధించిన విషయాలన్నిటికి యీ budget లో చాలాశ్రద్ధ చూపించారు. తూర్పు గోదావరి జిల్లాలోని భద్రాచలం, శీతానగరం వగయిరా ఏజన్సీలన్నింటిలోను విశాఖ, శ్రీకాకుళం జిల్లాల ఏజన్సీలుగూడ కొంతవరకు విద్యాభివృద్ధికి, ఆరోగ్యమునకు గ్రామాలలో రోడ్ల సౌకర్యము నిమిత్తమున్నూ, irrigation వగయిరాల సదు

పాయముల నిమిత్తం కొంతవరకు సొమ్ము budget లో కేటాయించి నందులకు వారిని అభినందిస్తున్నాను. మరొక విషయం. Hindu Religious Endowment విషయములో కూడ వీరు ఏ మాత్రము అశ్రద్ధవహించలేదు. దీనిమీద వీరు యీ మధ్యకు ఒక Bill కూడ pass చేయించారు. Renovation of old temples విషయములో చాలా ప్రాముఖ్యాన్ని యిచ్చారు. మన సంస్కృతిని ప్రతిపాదించే, ప్రకటించే ఈ మత ధర్మాదాయాలు పాడై పోయినవని భయం పడే రోజులుయివి. ఇటువంటి వాటిని గురించి ప్రత్యేకమైన బిల్లును తీసుకొనివచ్చి శాసనసభలో ప్రవేశపెట్టుతామని చెప్పినందులకు శ్రీవిశ్వనాథంగారిని అభినందిస్తున్నాను. ఒక్క విషయం కోరుతున్నాను. పిట్ల విషయములో క్రమమైన విచారణలు జరగాలి. ఈ విషయములో శాసనసభ్యులు, మరికొంతమంది పెద్దలతో ఒక కమిటీనివేసి, వారి అభిప్రాయములను ప్రాతిపదికగా తీసుకొని, ఈ Bill ను శాసనసభలో ప్రవేశపెట్టుతారని ఆశిస్తున్నాను. ఈ సందర్భంలో, శ్రీకాకుళం జిల్లాలోని గుళ్ళ శీతారాంపురంలో ఒక దేవాలయం వున్నది. ఇది చాలా ప్రాముఖ్యమైన దేవాలయము. పురాతన మైనదేవాలయము, ఇది శిథిలావస్థలోవున్నది. ఇది బొబ్బిలి రాజా వారి management లో వున్నది. దానికి ఎస్టిమేటువేసి, 60 వేలు, 70 వేలు రూపాయలవరకు renovation కు అవుతుందని చెప్పారు. అటువంటి సందర్భంలో రాజాగారు దానికి 3 వేలు sanction చేశారని తెలుస్తుంది. వర్షాకాలం దగ్గరకు వస్తున్నది. అది చాలా హీనస్థితిలో పడిపోయేటటువంటి శిథిలావస్థలో వున్నదని విశ్వనాథంగారికికూడ తెలుసును. కనుక వారు దాని విషయంలో ప్రత్యేకమైన శ్రద్ధవహించి, ఆ దేవాలయాన్ని నిలపడానికి తగినటువంటి చర్య తీసుకోవలసిందని మనవి చేస్తున్నాను.

తరువాత ఈ ఆంధ్రరాష్ట్రానికి యిప్పుడు వస్తున్నటువంటి చిక్కులే మా విశాఖపట్నం, శ్రీకాకుళం bifurcation సందర్భంలో కూడ వచ్చాయి. అవి యింతవరకుకూడ తెగలేదు. 1949 వ సంవత్సరంలో విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలని revenue bifurcation జరిగింది. అయితే, revenue bifucation జరిగిందిగాని, మిగిలినటువంటి

Sri P. Pundarikakshacharyulu] [17th March 1954

departments లో కూడ, ఈ Revenue bifurcation మాదిరిగానే, bifurcation జరగలేదు. ఈ విధంగా ఎందుకు చేయడానికి వీలులేదో అర్థంకావడం లేదు. వెనుక మద్రాసు అసెంబ్లీలో యీ విషయమై చర్చించినప్పుడు, మాణిక్యవేలు నా య క రు గా రు చేస్తామని మాట యిచ్చారు కాని ఏమీ జరగలేదు. ఉదాహరణకు పోలీసుకు సంబంధించినంతవరకు, South Vizag అని North Vizag అని రెండు జిల్లాలు విభజింపబడినవి. దానిప్రకారం, విశాఖపట్నం జిల్లాలోని కొన్ని ప్రాంతాలు శ్రీకాకుళం జిల్లా లోని కొన్ని ప్రాంతాలు North Vizag జిల్లా Police Superintendent క్రింద వస్తున్నవి. శ్రీకాకుళం జిల్లాలోని కొన్ని ప్రాంతాలు విశాఖపట్నం Superintendent క్రిందకు వస్తున్నవి. శ్రీకాకుళం జిల్లా Superintendent విజయనగరంలో వుంటున్నాడు. అదేవిధంగా, Co-operative Departmet లో కూడా, విశాఖపట్నం జిల్లా Deputy Registrar' jurisdiction క్రింద శ్రీకాకుళమునకు సంబంధించిన బొబ్బిలి, సాలూరు తాలూకాలు ఉన్నవి. ఇదే విధంగా ఇంజనీరింగు డిపార్టుమెంటులో కూడ, శ్రీకాకుళం జిల్లాకు సంబంధించిన Executive Engineers విశాఖపట్నం Division క్రింద వస్తున్నారు. Education Department లో కూడ యిదేవిధంగా ఉంటున్నది. ఇప్పుడు యీ రాష్ట్రంలో ఆఫీసర్లు, High Court కు, Capital కు, వచ్చిపోవడానికి ఏలాటి యిబ్బందులున్నాయో, అదేమోస్తరుగా మా ఆఫీసర్లకు సంబంధించినంతవరకు, ప్రజలు ఈ ఆఫీసర్లకొరకు వివిధ కేంద్రాలకు, చోట్లకు పోవలసిన పరిస్థితులు ఏర్పడినవి. కనుక ఇటువంటి యిబ్బందులు లేకుండా, Revenue bifurcation ఏ విధంగా జరిగిందో అదే మోస్తరుగానే మిగిలిన డిపార్టుమెంటులలో కూడ ఆ jurisdiction adjustments చేయవలెనని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

శ్రీ కా కు ళ ం జి ల్లా ఏర్పడి సుమారు 4 సంవత్సరములైనది. కాని దానికి headquarters buildings ఇంతవరకు నిర్మించబడలేదు. దీనినిగురించి మద్రాసు శాసనసభలో చర్చించగా, క్రిందటి సంవత్సరం వారు ఆ పని చేస్తామని వాగ్దానంచేశారు. క్రిందటి బడ్జెటులో token grant కూడ యిచ్చారు. మరల ఏమి జరిగిందో తెలియదు. ఈ బడ్జెటులో ఈ headquarters buildings కు గాను ఏమి కన్పడలేదు.

17th March 1954 ] [Sri P. Pundarikakshacharyulu

ఇప్పుడైన ఈ headquarters buildings కు గాను ప్రభుత్వము పూనుకొంటుందని ఆశిస్తున్నాను. ఈ మోస్తరుగానే District Hedquarters hospital, మొదలైనవన్నీ కూడ సక్రమంగా నిర్మించి శ్రీకాకుళం జిల్లాను ఒక మంచిస్థితికి తీసుకురావడానికి ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను.

తరువాత ఈ abolition అయినటువంటి estates survey లో settlement అయినటువంటివి చాలా తక్కువ. నిజంగా జమీందారీలలో ఉన్నటువంటి రైతులు, రైత్వారీ గ్రామాలలో ఉన్నటువంటి రైతులతో సరిసమానంగా లాభనష్టాలు అనుభవించాలి. నిజంగా conversion into ryothwari areas and settlement కాకపోతే, ఈ abolition వల్ల నష్టమేగాని, లాభము ఏమి ఉండదు. Survey and settlement చాలా తొందరగా జరగవలసినటువంటి విషయము. ఇప్పుడు ఈ మధ్యన ప్రశ్నోత్తర సమయములో చెప్పిన సమాధానాలు బట్టి, ఈ బడ్జెటుపట్టి చూస్తే, Survey and settlement కు 10, 15 సంవత్సరాలు పట్టేటట్లుంది. ఈ విషయములో ఎంతడబ్బు అయినా చేయవలసి వుంటుంది. నిజంగా రైతుకు లాభము చేయాలంటే, ఈ survey and settlement వెంటనే ప్రారంభంచేయాలని మనవి చేస్తున్నాను.

తరువాత మన administration కు ప్రాతిపదిక అయినటువంటి village officers యొక్క కడగండ్లుచూస్తే రోజురోజుకు హెచ్చిపోతున్నవి. అందులోను, జమీందారీలకు ఆలవాలమైన మా జిల్లాలో, పాలకొండ తాలూకాలోను, మా బొబ్బిలి తాలూకాలోను, ఈ ఉద్యోగులమీద ఉన్నటువంటి ఆఫీసర్లు ఒకే డిపార్టుమెంటుకు సంబంధించినటువంటివారు, ఇద్దరు, ముగ్గురు ఉంటున్నారు. general duty తాశీల్దారు కూడా వారిమీద అధికారే. తరువాత Revenue Divisional Officer వాళ్ళమీద అధికారి. Estate manager కూడ అధికారే. వీళ్ళంతా ఒకే రోజున ఈ ఉద్యోగస్తులమీదపడుతూ ఉంటారు. అందుచేత survey and settlement అయ్యేలోగా, ఈవిధముగా ఒక్కొక్క తాశీల్దారుకు కొన్నికొన్ని పనులనిలేకుండా, ఎస్టేటు తాలూకాలని, రివిన్యూ తాలూకాలని, rent reduction తాలూకాలని ఎన్నో తాలూకాలుపెట్టి ప్రజలనుకష్టపెట్టకుండా వీటన్నిటికికూడ ఒక interim

arrangement చేసేటట్లు ఆలోచించి, ఒకే తాశీల్దారుక్రింద, ఒకే Estate Collector క్రింద ఒకే R. D. O. క్రింద ఈ ప్రజలు, ఈ గ్రామాలు ఉండేటట్లుగా చేయవలెనని మనవిచేస్తున్నాను.

తరువాత ఈ village officers కు ఇచ్చే జీతాలు గురించి, ఇవి ఏమాత్రం చాలవని ఇటీవల అనేక ఆందోళనలు జరుగుతున్నప్పటికి, ప్రభుత్వము ఈ విషయంలో శ్రద్ధవహించకుండా ఉన్నది. నిన్న ఎలక్ట్రిసిటీ డిమాండును ప్రతిపాదిస్తూ ఆచర్చ సందర్భంలో, సంజీవరెడ్డిగారు, ఈ Public Works Departmentలో ఖర్చు తగ్గించలేము, ఇది విపరీతమైనటువంటి ఖర్చు ఏమీకాదని చెప్పారు. అటువంటప్పుడు ఈ village officers కు సానుభూతి సూచకంగానైనా, కనీసం రెండు రూపాయలైనాపెచ్చుచేయడానికి ఏమికష్టమో నాకు అర్థంకావడంలేదు. ఈ విధంగా సానుభూతి సూచకంగానైనా కొంతవరకు హెచ్చుచేయలేని పక్షంలో, 2 వందలు, 3 వందలు జీతాలు తీసుకొంటున్న N. G. Os.కు District Board teachersకు ఇతర employees కు, వారి కుటుంబాలకు ఇస్తున్నటువంటి వైద్య, విద్యాసౌకర్యాలకైనా ఈvilage officers యొక్క బిడ్డలు, కుటుంబాలు ఎందుకు నోచుకోలేదో నాకు అర్థంకావడంలేదు. కనుక కనీసం, N. G. Os కు వలె ఈ village officers కు కూడ ఉచిత వైద్య, విద్యా సౌకర్యాలు కలుగజేస్తారని ఆశిస్తున్నాను.

తరువాత శ్రీకాకుళంజిల్లాలో పాలకొండ, చీపురుపల్లి తాలూకాలు చాలా పెద్ద తాలూకాలని విశ్వనాథంగారికి తెలుసు. కనుక వీటిని bifurcate చేయవలసినదని కోరుచున్నాను. ఇప్పుడు ప్రజలు Munisif Court కు వెళ్ళడానికి చాలా బాధలుపడుతున్నారు. కనుక ఈ తాలూకాలను bifurcate చేయవలసిన అవసరము ఎంతైనా ఉన్నది. దీనికి ఆ కలెక్టరుగూడ సుముఖంగా ఉన్నారు. ఈ విషయంలో వారు రిపోర్టుకూడ పంపించారు. అది ప్రభుత్వానికి చేరిందో లేదో తెలియదు. కనుక ఈ రెండు తాలూకాలను bifurcate చేస్తారని ఆశిస్తున్నాను.

మరొక చిన్నవిషయమున్నది. రాజాము, పాలకొండలలో ఉన్నటు

వంటి sub-magistrate పనికి 3 రోజులు రాజాములో work చేసే arrangement ఉన్నది. అంగా నెలకు 6 రోజులు అక్కడ పని చేస్తారు. ఈ 6 రోజులలో రాజాము చుట్టుప్రక్కన ఉన్నటువంటి కక్షిదార్లు రాజాముకు వస్తారు. మిగిలిన రోజులలో పాలకొండకు వెళ్ళవలసిన అవసరం ఉన్నది. ఇది చాలా కష్టంగా ఉంటుంది. కనుక రాజాములోనే, ఒక sub-magistrate court ను ప్రత్యేకంగా ఏర్పరచినట్లయితే, ఆ చుట్టు ప్రక్కల ఉన్నటువంటి ప్రజలకు చాలా అనుకూలముగా వుంటుంది. కనుక అటువంటి సౌకర్యాన్ని కలుగజేస్తారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

Sri D. LAKSHMIAH:— అధ్యక్షా, ఈజిల్లా పరిపాలనా విధానమునుగురించినను cut motion నేను బలపరుస్తున్నాను. జిల్లా పరిపాలనలోని అవతవకలనుగురించి కొన్ని విషయాలు ప్రభుత్వదృష్టికి తెస్తున్నాను. ఈ పరిపాలనావిధానములో ఉద్యోగులు ప్రజలకుఏమైనా అనుకూలపద్ధతిలో నడిపిస్తున్నారంటే, అదేమి కనబడదు. ఇప్పుడు హరిజనుల విషయం చూడండి. గతపదు సంవత్సరాలనుంచి యిప్పటివరకు కూడా ప్రభుత్వమువారు వాళ్ళకు యిళ్ళస్థలాలు లేకుండా బాధపడుతున్నారనే సంగతి గమనించినట్లు లేదు. ప్రభుత్వమువారికి యిదివరకు ఎన్నో మహాజర్లు, పిటిషనులు యిచ్చియున్నప్పటికిని, యింతవరకు ఏవిధమైన ఉపయోగము కనబడలేదు. హరిజనులు పిటిషనులు యివ్వడం, దానిమీద లేబరు ఆఫీసరుగారు రావడం, ఆయన యిళ్ళస్థలాలు ఫలానాచోట యివ్వవచ్చునని recommend చేయడం, తరువాత ఆయన మారిపోయి యింకొక ఆఫీసరువచ్చి, ఆ స్థలముయొక్క అనుభవముదారునకు అనుకూలంగా, యీ స్థళం యివ్వటానికి వీలుకాదని వ్రాయడం, అందుమీదట పర్యవసానంచూస్తే, ఏమికాదు అనేది కనబడుచున్నదే గాని, వాళ్ళకు యింతవరను ఎక్కడాగూడా యిళ్ళస్థళాలు యివ్వడము అనేది జరుగలేదు. ఇంతవరకు ఈ హరిజనులకు ఏదోవిధంగా అన్యాయమే జరుగుచున్నది. లగడపాడు గ్రామానికి ఒక Labour Officer వచ్చి, ఫలాని స్థళము వాళ్ళకు మంజూరు చేస్తానని చెప్పి, డబ్బు 300 రూపాయలు డిపాజిట్ చేయమని అంటే, ఆవిధంగా డిపాజిటు చేశారు. ఈ స్థలాలవిషయంలో అదనంగా ఈ హరిజనులు వెయ్యిరూపాయలు ఖర్చు

Sri D. Lakshmiah] [17th March 1954

పెట్టారు. ఈ విధంగా ఖర్చుపెట్టుకొని, లేబరు ఆఫీసరు చెప్పిన ప్రకారము డబ్బు deposit చేసినప్పటికికూడా, ఆఫీసరు ఆ భూఖామందుతో షరీకై చివరకు ఆ స్థలం మంజూరు చేయటానికి వీలులేదని వ్రాశాడు. ఆ స్థలం రాకపోగా, డిపాజిటుకూడా వాపసు యివ్వలేదు. ఈ అన్యాయము లన్నియు ప్రభుత్వం గుర్తించాలి.

తరువాత నెమలికల్లు అనే గ్రామములో హరిజనులు 1930 వ సంవత్సరమునుంచి తోపులలోని 2 ఎకరాల స్థలమునకు అర్జీలు పెట్టుకొంటున్నప్పటికిని, ప్రభుత్వమువాళ్ళకు ఇంతవరకు ఎక్కడాకూడా స్థలం మంజూరు చేయలేదు. దాని వివరాలు కొద్దిగా చెబుతున్నాను ఈ గ్రామము చేరువలో ఒక తోపువున్నది. అందులో 8 ఎకరాలభూమి వున్నది. అందులో రెండు ఎకరాలు మాత్రం యిళ్ళకుగాను ఈ హరిజనులు దరఖాస్తుపెట్టుకొని వున్నారంటే, కారణం, వాళ్ళకు ఇవ్వకుండా, ఆ 8 ఎకరాలభూమి ఒక రాజకీయ బాధితునకు యిచ్చుటకు ప్రయత్నం జరుగుచున్నది.

తరువాత చినకాకాని గ్రామంలో హరిజనులు యిండ్లులేక చాలా బాధపడుచున్నారు. ఒక పది ఎకరాల భూమిలో సుమారు నూరు కుటుంబాలు యిండ్లువేసుకొని నివశిస్తున్నారు దానిచుట్టున్నూ మాగాణిభూమి వున్నది. హరిజనులకు ఆ చుట్టుప్రక్కల ఎక్కడాకూడా యిళ్ళ కొరకు మరొకస్థలములేదు. అందువల్ల ఈస్థలము ఆహరిజనులకు పట్టాలకు ఇవ్వమని అనేక అర్జీలు పెట్టుకున్నప్పటికిని, ఆ గ్రామ పెత్తందార్లు ప్రభుత్వోద్యోగుల సహాయముతో ఆభూమిని ఇవ్వటానికి వీలులేదని వ్రాయించడమువల్ల, ఆ భూమిని వాళ్ళకు ఇంతవరకు ప్రభుత్వము యివ్వలేదు.

ఆ గ్రామములోనే ఒక చెరువు పోరంబోకు రెండు ఎకరాలు వుంటే, అక్కడ రెండు సంవత్సరాలుగా 70 మంది కుటుంబాలు యిళ్లు కట్టుకుని నివసిస్తూవుంటే, అక్కడగూడా ఆ గ్రామ పెత్తందార్లు ప్రభుత్వోద్యోగస్థులచు కట్టుకుని ఆ స్థలం ఇవ్వటానికి వీలులేదని చెప్పించారు. ఆ గ్రామమునసబును, డిప్యూటి తహశీల్దారుచు కట్టుకొని అక్కడ వేసు

కున్న యిళ్ళను నిర్బంధంగా పడగొట్టడానికి ఆగ్రామ పెత్తందార్లు ప్రయత్నిస్తే, తరువాత ఆ హరిజనులు జిల్లాకలెక్టరు వద్దకుపోయి మొరపెట్టుకుంటే, వారు stay order యిచ్చారు. అక్కడవున్న Revenue Inspector కలెక్టరు యిచ్చిన stay order ను బయటకు రానీయకుండా 4, 5 రోజుల తరువాత అక్కడకట్టిన యిండ్లను పడగొట్టించినారు. హరిజనుల గోడు ఈవిధంగా వున్నదని ప్రభుత్వదృష్టికి తెస్తున్నాను. గనుక శ్రద్ధతో గమనించాలని అంటున్నాను.

తరువాత పెరుమాక అనే గ్రామము వున్నది. అక్కడ forest బంజరులో 27 కుటుంబాలవారు 37 యకరముల భూమిని 15 సంవత్సరములనుండి సాగుచేస్తున్నారు. కలెక్టరు ఆ భూమిని చూచి దానికి ryotwari శిస్తును నిర్ణయించారు. పట్టాకు యివ్వమంటే, యివ్వలేదు. ఈ భూమిని 1945 సంవత్సరములో అప్పటి కలెక్టరుగారు యివ్వటానికి recomend చేశారు. కాని అలాంటి భూమికి 1952 సంవత్సరమునుంచి గవర్నమెంటువారికి ప్రతి సంవత్సరము శిస్తుమాత్రం కట్టుతూవస్తున్నారు. రశీదులు తీసుకుంటున్నారు. 1952 మార్చి నెలలో ఆ భూమికి శిస్తులు వసూలుచేశారు. తరువాత ఆసంవత్సరము ఆగస్టు నెలలో ఆ గ్రామ కరణముగారు భుక్తదార్లను లెఖలలోచేర్చకుండా ఆభూమి ఖాళీగావున్నది సాగుచేయడంలేదు, అనివ్రాశారు. ఒక కాంగ్రెసు వాడి అయిన మేకా కోటిరెడ్డిగారు హైస్కూలు కొరకు కావలసియున్నదనే సాకుతోఆభూమిని పట్టాకు తీసుకున్నారు. మార్చి నెలలో శిస్తుప్రభుత్వం వసూలు చేసింది. రశీదులు యిచ్చారు. ఆగస్టునెలలో ఆభూమిని ఇతరులకు హైస్కూలుపేరుతో పట్టాకుయివ్వడం జరిగింది. ఆరెడ్డి ఆగ్రామములో 20, 30 సంవత్సరాలుగా ధర్మాదాయం భూమి 12 యకరములు అనుభవించుచున్నాడు. ఇప్పుడు యీ భూమి హైస్కూలుకు కావాలని లాగుకొన్నాడు. అందలోవున్న హరిజనులను లేవగొట్టడముతో పెద్ద సంఘటన జరిగింది. ఈ హరిజనులు సిమెంటుఫ్యాక్టరీకి వెళ్ళి రాత్రి 11 గంటలకు వచ్చుచుండగా 100 మంది ఫ్యూరీవెలపల కాపలా కాచి వచ్చేవారిని 11 మందిని తీవ్రంగా కొట్టినారు. అందులో 6 మంది పారిపోయినారు 5 మంది పడిపోయినారు. దెబ్బలు తగిలి తరువాత మంగళగిరివెళ్ళి పోలీసు స్టేషనులో రిపోర్టుచేసినారు. ఈ

దెబ్బలు తగిలిన వాళ్ళను ఆ రెడ్డిగారి యింటిముందునవున్న పందిరి గుంజలకు అయిదుగురిని కట్టివేసినారు. మరునాడు సాయంత్రం 5 గంటలకు పోలీసువారు వచ్చేవరకు కట్టివేసియున్నారు. తరువాత పోలీసువారు వచ్చిన తరువాత అయిదుగురిని గుంటూరు హాస్పిటలుకు తీసుకొనివెళ్ళి హాస్పిటల్లో చేర్చారు. మరునాడు 5 గంటలకు Sub-Inspector, Circle Inspector యిద్దరువచ్చి విచారించారు. పోలీసువారు వచ్చేటంతవరకు వాళ్ళను నిర్బంధించి కట్టివేశారు. హరిజనులకు ఏవిధంగా అన్యాయాలు, అక్రమాలు జరుగుతున్నవో ప్రభుత్వం గుర్తించాలి.

తరువాత కృష్ణా సిమెంటుఫ్యాక్టరీ సమీపములో సుమారు నూరు మంది కుటుంబాలు యిప్పటికి 9 ఎకరాల భూమిలో, ఎన్నోసంవత్సరాల నుంచి యిళ్ళువేసుకొని నివశిస్తున్నారు. అయితే ఆ సిమెంటు ఫ్యాక్టరీ మేనేజరు, ఇంకా అక్కడివారికి చెందిన ఆఫీసర్లు ఆ 9 ఎకరాలు కాజేయాలనే వుద్దేశ్యముతో నూరుమంది యిళ్ళవాళ్లను లేవగొట్టాలనే ప్రయత్నములో వున్నారు. ఈ విషయము ప్రభుత్వమువారికి తెలిపి enquiry చేసి పట్టాలకు యివ్వమని పిటిషనులుగూడా పెట్టుకున్నారు. ఈవిధంగా ఎన్నోసార్లు పిటిషనులు యివ్వడం జరిగింది. ఇంతవరకు వాళ్ళవిషయము ప్రభుత్వము అలోచించిన పాపాన పోలేదు.

ఇక పోతే మంగళగిరి ఠానులో, కొత్తపేట అనే ప్రదేశములో యిప్పటికి 30 సంవత్సరాల క్రితము రెండు వందలమంది హరిజన కుటుంబాలు ఇళ్లు కట్టుకొనివున్నారు. అక్కడవుండే స్థానిక అధికార్లు ఆ స్థలాలకు పట్టా యివ్వకపోగా ప్రతి సంవత్సరము వాళ్ళకు వేరే స్థలము యిస్తాము' అక్కడినుంచి లేచిపొమ్మని నిర్బంధముపెట్టుచున్నారు. ఇప్పటికి 7, 8 సంవత్సరాలుగా ఎన్నిపిటీషనులు ప్రభుత్వానికి, అక్కడస్థానిక అధికారులకు పెట్టుకొన్నప్పటికికూడా ఒక్కరుకూడావచ్చి, వాళ్ళ గోడు పట్టించుకొన్నవారు కనబడలేదు. అయితే మంగళగిరిలో జాస్తిగా weavers వుంటున్నారు. వాళ్లకు ఒక weavers' society అనేది వున్నది. దానికి ఒక కాంగ్రెసువాది ప్రెసిడెంటుగా వున్నాడు. రిజిష్ట్రారువచ్చి తనిఖీ చేసేసరికి ఆప్రెసిడెంటు సుమారు 22 వేల రూపాయలు సొసైటీడబ్బు కాజేసినట్లు బయట పడ్డది. తరువాత ఆ సొసైటీ

డైరెక్టరులను కొత్తగా ఎన్నుకోవడంకూడాజరిగింది. ఈ విధంగా ఆగ్రామములోని weavers చాలామటుకు డబ్బుకోల్పోయి నాశనమైనారు. ఈ నష్టమువల్ల చేనేత పారిశ్రామికులు ఎంతోమంది బాధపడ్డారు.

అటు తరువాత ఆత్మకూరులో సుమారు 25 సంవత్సరాలుగా 50 మంది కుటుంబాలవారు యిళ్ళు కట్టుకొని వుంటున్నారు. వాళ్లు వుండేస్థలము పట్టాకు ఇవ్వమని ఎన్నిసార్లు అధికార్లకు విన్నవించుకున్నప్పటికిని, ఆ గ్రామస్తులు వాండ్లను అక్కడనుంచి లేచి పొమ్మని అంటూ నిర్బంధము చేస్తున్నారు. ప్రభుత్వోద్యోగులు వచ్చి విచారించారాంటే, అదికూడా కనబడలేదు. కాబట్టి ప్రభుత్వమువారు నేను యిప్పుడు చెప్పినవిషయాలన్నియు విచారించి తగుచర్య తీసుకొంటారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

Sri L. LAKSHMANA DAS:—అధ్యక్షా, ఈdemandను నేను బలపరుస్తున్నాను. కాని యిది చాలా ముఖ్యమైన demand. జిల్లా బోర్డు పరిపాలనకు సంబంధించిన, యీ demand పై మిత్రులు చాలా ముఖ్యమైన సలహాలు యిచ్చివున్నారు. వాటిని ప్రభుత్వం సక్రమంగా ఆలోచించవలసి వున్నదని నేను చెబుతున్నాను. ఈ జిల్లాబోర్డుల పరిపాలన మంచిదా, చెడ్డదా అన్నది; జిల్లాబోర్డుల పరిపాలన ప్రభుత్వముమీద ఆధారపడి వున్నదన్న విషయము ప్రభుత్వము గుర్తించగల్గుతుందని నేను ఆశిస్తున్నాను. ముఖ్యంగా జిల్లాలలో లంచగొండితనము నానాటికీ పెరుగుతున్నది. లంచగొండితనం అరికట్టే సందర్భంలో ఆలస్యం, విలంబన, జరుగుతున్నదనే విషయంలో అందరి సభ్యులతోను నేను యేకీభవిస్తున్నాను. లంచగొండితనం వుండడానికి మూలకారణం యేమిటో మనం తెలుసుకొని, అట్టిది యేవిధంగా అరికట్టడానికి ప్రభుత్వము యీ విషయంలో తగిన శ్రద్ధతీసుకోవాలెనో నేను మనవిచేస్తున్నాను. ఈ లంచగొండితనమునకు కారణములు యేమైనా చెప్పేటప్పుడు; వారు వాటిని అరికట్టడానికికూడా తగిన సూచనలను యిస్తే మంచిది. అంతేకాని, ఒక వుద్యోగి లంచగొండి అయాడంటే, అతనిని గురించి report పై అధికారి దగ్గరకు పంపుకుంటే, ఆ పై అధికారి ఆయనపై కొంచెము కనికరం చూపించడం సహజము.

Sri L. Lakshmana Das] [17th March 1954

మద్రాసు శాసనసభలో మాట్లాడుతూ నేను యీ విషయమై ఒక సూచన యిచ్చాను. దానిని అరికట్టడానికి తగిన కారణాలు తెలుసుకొని, అందుపై కార్యక్రమములో విలంబన జరుగుతూన్నప్పుడు, ప్రభుత్వము ఒక ప్రత్యేక department స్థాపించాలని నేను మనవిచేస్తున్నాను. జిల్లాకు ఒకొక్క Public Relations Officerను వేసి వారిని యే ఒక revenue అధికారి క్రిందనో, లేక police అధికారి క్రిందనో వుంచకుండా, direct గా మంత్రిగారికి సంబంధించిన ఆ department ద్వారా యెక్కడ యేమి జరుగుతున్నదో స్వయంగా తెలుసుకొనడానికి వీలుండేటట్లుగా, ఆ పరిపాలనకు ఒక సలహా సంఘమును స్థాపించినట్లయితే, జిల్లాలలో జరుగుతున్న అమకతవకలను తెలుసుకొనడానికి ప్రభుత్వమునకు తోడ్పడుతుందని, అందుకు ప్రభుత్వము తగు ప్రయత్నము చేసిననాడు, యీ కాగితాలు క్రిందనుండి మీదికి, మీదినుండి క్రిందికిరావడానికి, అందులో ఆలస్యం యేమీ జరగకుండా వుండుటకు వీలుంటుందని నేను మనవిచేస్తున్నాను.

ఇంకొక ముఖ్యమైన విషయము యేమిటంటే, యీనాడు వుద్యోగులకు promotion యిచ్చే సందర్భంలో ప్రభుత్వము కొన్ని విషయాలను తప్పకుండా శ్రద్ధతో గుర్తించాలి. నిజంగా honest గా వుండే వుద్యోగులు యీనాడు లేకపోలేదు. ఉద్యోగులలో కూడ చాలా honest గా వుండి, ప్రభుత్వ కార్యక్రమములను సక్రమంగా నడిపేవారు వున్నారు. వారిపట్ల ప్రభుత్వం ప్రత్యేకశ్రద్ధ తీసుకొని honest గా సక్రమంగా స్థూలంగా ఆలోచించి, వారు juniors గా వున్నప్పటికి, juniors అనే విచక్షణ చూపించకుండా, కనీసం యే పదిమందికైనా promotion యివ్వడానికి తగినవారిని తీసుకొనడానికి ప్రయత్నం చేస్తారని నేను మనవిచేస్తున్నాను. ఆ వుద్యోగస్థులు honest గా లేకపోయి, లంచగొండులుగా ప్రవర్తిస్తే, అటువంటివారు దానికి ఖర్చుపెట్టి, వారు promotion అవుతే, honest గా వుండేవారికి అదొక పెద్దదెబ్బ అని నేను హృదయపూర్వకంగా చెబుతున్నాను. జిల్లాలో వున్నాడులైనటువంటి గ్రామోద్యోగులు జీతం మొదలగు వాటి విషయంలో ప్రభుత్వం ముఖ్యంగా ఆలోచించాలి. గ్రామోద్యోగస్థులలో లంచగొండితనమువున్నదా, లేదా అంటే, వుంటేవుండవచ్చు.

17th March 1954] [Sri L. Lakshmana Das

ప్రతి revenue వుద్యోగి, గ్రామాలకు పోయి, గ్రామోద్యోగులపై వారి అధికారాలను చెలాయించడం, ప్రవాసం పోయి ఆ గ్రామోద్యోగులపై పడటం, వారు వీరిక్రింద ఖర్చుపెడుతున్నారంటే వారికి ఇంతడబ్బు ఎక్కడ నుండి వస్తుందో ప్రభుత్వ గమనించాలని నేను మనవిచేస్తున్నాను. పైగా ఆ అధికారులకు యీ గ్రామోద్యోగులు సక్రమంగా సౌకర్యాలు కల్గించలేకపోయినా, వారికి వుపచర్యలు మర్యాదలు చేయలేకపోయినా, ఆదరాభిమానాలు లేకపోయినా, యెక్కడనో లంచాలు తెచ్చి ఆ గ్రామోద్యోగులు పై వారికి supply చేయలేకపోయినా వారికి దెబ్బతగులు చున్నది. వారికి యీనాటి వరకూ యేమీ encourgment లేదు. తక్కిన departments లో పెంచినట్లుగా, వారి జీతాలు పెంపు చేయ లేదు. ఇంతే కాకుండా, వారి పిల్లలు చదువుకొనుటకు జతాలు లేకుండా చేయాలని నేను హృదయపూర్వకంగా కోరుతున్నాను. వారికి test pass అవాలనే నిబంధన తీసివేసి, గ్రామోద్యోగులు కనీసం స్కూల్ ఫైనల్ (S. S. L. C.) pass కావాలని, అటువంటివారినే వుద్యోగాలలో వేయాలని ఒకనిబంధనను వుంచటం నాకు మంచిదిగా కనుపిస్తున్నది. ఈ విషయంలో సక్రమమైన మార్గం అవలంబించి. యీ అవకతవకలను సరి దిద్దుకోకపోతే తప్పకుండా అన్యాయాలకు, అక్రమాలకు ప్రభుత్వమే బాధ్యతవహించవలసి వుంటుందని, కాబట్టి దానివిషయంలో ముందుగా శ్రద్ధతీసుకోవాలని నేను ప్రభుత్వమును హృదయపూరకంగా కోరు తున్నాను.

ఇంకొక విషయమేమంటే, యెక్కడయేమి జరిగినా, దానికి తప్పు Congress వారిదేనని మిత్రులు చెబుతూ వచ్చారు. అవి ఏ యే గ్రామాల్లో జరుగుతున్నాయో నేను యిదివరకే యెన్నోసార్లు చెప్పాలను కొన్నాను గాని, యిప్పుడు అవకాశము లభించింది కాబట్టి, నేను చెబు తున్నాను. నెల్లూరు జిల్లాలో ఒక communist పంచాయితీబోర్డు ప్రసిడెంటుగావుండి బోర్డుసొమ్మునంతాతిని పారిపోయారు. ఈ విషయా communist సభ్యులు వున్నారని చెప్పడంకాదు. వారికిగూడా ఈ విషయం తెలుసునను కొంటాను.

Sri B. SANKARAYYA:—ఆ కమ్యూనిస్టు యెవరో, వారి పేరు చెప్పండి.

Sri L. LAKSHMANA DAS:— ఇప్పుడు పేర్లుగురించికాదు. ఆ పంచాయితీబోర్డు ప్రశిడెంటు కమ్యూనిస్టు అని తెలిసింది.

(At this stage, there were some interruptions from the opposition benches.)

Mr. SPEAKER:—It is very bad. Order should be maintained. The hon. Member who last spoke mentioned the names of some Congressmen and said that they were bad. The hon. Member Sri L. Lakshmana Dass now says that simply because one communist is bad, he cannot say that all the communists are bad. There is nothing in it and no exception need be taken to it.

Sri B. SANKARAYYA:—Point of order, Sir.

Mr. SPEAKER:—No point o order. Please take your seat.

Sri B. SANKARAYYA :— Point of Order, Sir, నేను చెప్పేది యేమిటో చెప్పనివ్వండి.

Mr. SPEARER :— There is no point of order in this. The hon. Member will please take his seat.

Sri L. LAKSHMANA DAS :— తరువాత estates abolish అయిన గ్రామాల్లో (Interruption).

Sri B. SANKARAYYA :- Point of order, అంటే, నేను యేమి చెప్పుతున్నానో చెప్పనిచ్చి, రూలింగు యివ్వండి.

Mr. SPEAKER :— No Point of order.

Sri K. VARADACHARI :— Mr. Speaker, Sir, The hon. Member is not yielding to sit. అందువల్ల యెవ్వరో ఒక్కరు కూర్చుని, రెండవవారు మాట్లాడుతే మంచిది.

Sri B. SANKARAYYA:—Point of order, Sir.

Mr. SPEAKER.—What is the point of order.

Sri T. NAGI REDDI.—Point of order యేమిటంటే. ఒకవూళ్లో, ఫలాగో పంచాయితీబోర్డు ప్రశిడెంటు అని, వారెవరో వారి పేరు చెబితే మంచిదికాని, అన్యథా చెపుతేమంచిదికాదు పైగా వారు యెవరో వొకరని చెప్పేకంటే, ఒక గ్రామంలో, పల్లెలో అని చెప్పడం మంచిది. కాబట్టి ఫలానా communist ఆ నెల్లూరుజిల్లాలో అనిచెప్పి, ఆగ్రామం పేరు, ఆతనిపేరు communist party నాయకులమైన మాకు చెబితే, ఆ విషయంలో నేను చర్యతీసుకొంటానని తమరికి మేము తీసు కొన్న చర్య యేమో తెలియజేస్తానని నేను హామీ యిస్తున్నాను. బహిరంగంగా ఆరోపణచేయడం బాగుండదని, అందువల్ల వచ్చే ప్రయోజనం యేమీలేదని చెబుతున్నాను. నేనుకోరియున్నట్లు వారిపేరుచెబితే, అది న్యాయం అనిపించుకొంటుందని నేను మనవి చేస్తున్నాను.

Sri B. SANKARAYYA:—On a point of order, Sir,

Mr. SPEARER:—There is no point of order. The hon. Leader of the Oppssosion has already explained it.

Sri L. LAKSHMANA DAS:— నేను చెప్పిన అంశం నాగి రెడ్డిగారికి తెలుసును అని అనుకొంటాను. వారికి పేరుకావలెనంటే, కనుక్కొని తరువాత తెలియజేస్తాను.

జమీందారీలను రద్దుచేసి, estate గ్రామాలను ప్రభుత్వం తీసుకున్నప్పుడు survey కాకుండా, రెండు ఎకరాలను 10 ఎకరాలు అని, పదియెకరాలను రెండు యెకరాలనిచెప్పి, అక్కడవున్న అధికారులు అంచనావేసి, వారికి హెచ్చు, తగ్గు అనిలేకుండా, ప్రభుత్వంవారి దగ్గరనుంచి హెచ్చుగా పన్నులు వసూలుచేయటం జరుగుతోంది. దానిపై ప్రభుత్వము ప్రత్యేక శ్రద్ధవహించాలని నేను కోరుతున్నాను. Srikakulam జిల్లా bifurcation అయిన తరువాత, అక్కడ అన్ని offices పెట్టలేదు. Police office విజయనగరంలో వుంది. అక్కడ వున్న co-operative banks యెన్నో areas లో వున్నవి. వాటిలో 4, 5

ముఖ్యంగా యీ విజయనగరంలో వున్నాయి. అన్ని banks ను శ్రీకాకుళంలోని Central Bank తో కలిపే యేర్పాటు చేయాలని నేను ఆశిస్తున్నాను. ఈ డిమాండుమీద అన్ని పక్షాలవారు ఇచ్చిన సలహాలనూకూడ ప్రభుత్వం సక్రమంగా గమనించి ఈ సలహాలలో ఆచరణ యోగ్యం అయినవాటిని వెంటనే ఆచరణలో పెట్టాలని ప్రభుత్వాన్ని కోరుతూ ఇంతటితో నేను విరమిస్తున్నాను.

Sri B. SANKARAYYA:— శ్రీనాగిరెడ్డిగారికి సమాధానం చెపుతూ తరువాత information ఇస్తాం అని చెప్పారు. వారు information ఇప్పుడు ఇస్తారా లేక వారు చెప్పినదాన్ని withdraw చేసుకుంటారా? అని అడుగుతున్నారు.

No reply.

Sri T. NAGI REDDI:-అధ్యక్షా, చర్చలలో చాలా ప్రధానమైన district administrtion మీద రెండువైపులాకూడ ముఖ్యమైన సూచనలు ఇవ్వటం జరిగింది. ప్రతిపక్షంకాని, ప్రభుత్వపక్షం కాని ఇచ్చేసూచనలు ఈ దఫాకూడ చాల ఆశతోను నిరాశతోను కూడ ప్రభుత్వం ముందుపెట్టాలని అనుకుంటూ దీన్ని జాగ్రత్తగా ఆలోచిస్తారని ఆశిస్తున్నాను. ప్రతిపక్షంగాని, ప్రభుత్వపక్షంగాని ఇచ్చిన ఈ సలహాలను ఆచరణలో పెట్టకపోడమే ప్రభుత్వోద్యోగాలలో కాని, departments లో గాని జరుగుతున్న అవకతవకలకు కారణం. ప్రభుత్వ సభ్యులు, ప్రతిపక్షసభ్యులు తెచ్చిన సూచనలను విచారణజరపకపోడంవల్ల పరిపాలనా విధానంలో ఏ కొద్దిగానూకూడా మార్పు రాలేదని మంత్రిగారు కూడ ఒప్పుకుంటారని ఆశిస్తున్నాను. ఈ సందర్భంలో ఒక సంగతి చెప్పాలి. ఈనాడున్నటువంటి district administration అంతా కూడా మన ప్రజలకు ఉపయోగపడే విధంగా మార్చుకుంటే తప్ప, administrative machinery ఇప్పుడున్నట్లుగానే ఉంటే ఈ machinery వల్ల ప్రజలకు ఉపయోగముండదని నేను అనుకొంటున్నాను. మన జిల్లాల్లో ఉన్నటువంటి ఈ పరిపాలనా యంత్రం ఏ పరిస్థితులలో, ఎవరిచేత ఎందుకు నియమించబడిందని మనం జాగ్రత్తగా ఆలోచిస్తే ఏ అవసరంకోసం ఆనాడు పరిపాలన చేసే

బ్రిటిష్‌వారు ఏర్పాటు చేశారో ఆ అవసరాలను తీర్చుకోడానికి వీరుకూడ ఉంచారు అని స్పష్టమౌతుంది. ఆనాడు బ్రిటిష్‌వారు తమయొక్క అధికారాన్ని నిలుపుకోడానికి పెట్టారు. ప్రజల ప్రధాన సమస్యలను ప్రభుత్వము ఆలోచిస్తారని అనుకోడానికి వీలులేకుండా ప్రజలకు పరిపాలనా యంత్రానికి సంబంధంలేని ఒక యంత్రాన్ని ఏర్పాటు చేసి పోయారు. దాన్ని ప్రభుత్వం ఎంతమాత్రం ముట్టుకో తలుచుకో లేదు. ప్రజలనుంచి వచ్చే అర్జీలను ఈ పరిపాలనా యంత్రం పరిష్కరించడానికి ఉపయోగపడుతుందని ప్రజల అవసరాలు తీరుస్తుందని అనుకోను. అందులోను కాంగ్రెస్‌వారు అధికారంలోకివచ్చిన తరవాత ఈ ఉన్న చిన్న యంత్రంలోనే ఇంకొక చిన్నయంత్రాన్నికూడా ఇమిడ్చుకుంటూ వచ్చారు. District పరిపాలనా యంత్రంలో వేసినటువంటి కాగితం ఏ బుట్టలోఉన్నదీ తెలియకుండా పరిపాలన చేసుకుంటూ వచ్చారు. ఎవరైనా ఇప్పుడు నాకు ఇల్లు కావాలని, ఇళ్ళస్థలం కావాలని చెప్పితే, ఎన్నో డిపార్టుమెంట్లు ఆ దఖాస్తును చూడాలి- Village Uplift శాఖ ఒకటి, Public Helth శాఖ ఒకటి, Revenue Department తరవాత పబ్లిక్‌వర్క్సు శాఖ ఒకటి Firka Development శాఖ ఇంకా ఏమైనావుంటే Women Welfare శాఖ అన్నిటిలో నుంచి తిరిగి తిరిగిపోయేటప్పటికి ఎప్పుడైనా మంత్రిగారికి కావలసి వచ్చినప్పుడు కూడా ఈకాగితం దొరకదని చెప్పుతున్నాను. మేము ఎన్ని అర్జీలు ఇచ్చినా వాటికి సమాధానం under considenation అని వస్తుంది. ఆ సమాధానం అయినా అందరికీ రావడంలేదు. నేనైతే నిద్రపోతున్నారా, బ్రతికివున్నారా, చచ్చారా అని అడిగితే under consideration అని వస్తుంది. మరో 4 ఉత్తరాలువ్రాస్తే that is under enquiry అని వస్తుంది. ప్రజలకు సంబంధించిన పనిని ఎట్లా చక్కబెట్టాలి అనేది ఒక చిన్న సమస్యగా ఉంది. ఇప్పుడు మన మిత్రుడు రామబ్రహ్మంగారు మాట్లాడారు. ఈ యంత్రంలో ప్రజాప్రతినిధులు పాల్గొనడానికి వీలుగా మార్పుచేస్తేతప్ప ఈ యంత్రం అనుకూలంగా పనిచేయలేదని ఆయన చెప్పారు. అది వాస్తవమని అనుకొంటాను. ఇప్పుడు జిల్లాలో నుంచి ఎన్నో చిన్నచిన్న విషయాలు పెద్దపెద్ద విషయాలు ప్రభుత్వానికి వస్తుంటాయి. ప్రజాప్రతినిధులు ఉంటే

Sri T. Nagi Reddi] [17 th March 1954

ఊరికే వాళ్ళు అసెంబ్లీకి వచ్చి కూర్చునిపోడం తప్పితే వేరే పనిలేదు. ఏదో చట్టం పాస్ అయిపోయింది, నాకు responsibility లేదని అనుకోడం జరుగుతున్నది. ప్రజలు కోరుతున్న చిన్న అవసరాలను తీర్చడానికి మనం ఏమాత్రం తోడ్పడగలం అనే విషయం కాని, ప్రజలకు ప్రభుత్వానికి మధ్యన ఉన్న సంబంధ బాంధవ్యాలను సరిచేసే పద్ధతికాని ఏమీలేదు. కాబట్టి మనం అటువంటి దేదైనా ఒకటి ఏర్పాటు చేసుకోవలసిఉంది. 1950 51 లో మాకు ఇళ్ళస్థలాలు కావాలని చెప్పి రైతులు అర్జీలు పెడితే, అందులో 3 అర్జీలను మాత్రమే sanction చేశారు. 12 సం|లు అయినప్పటికీకూడా ఇళ్ళస్థలాలకు అర్జీలు పెట్టుకుంటే మనం దాన్ని అమలుజరపలేక పోయాం అంటే ఈ విధంగా పరిపాలనా వ్యవస్థ వున్నదా అని అడుగుతున్నాను. దీనివల్ల ప్రజల్లో ఎంతఅసంతృప్తి బయలుదేరుతున్నది మనంగమనించాలని కోరుతున్నాను. ప్రతిచోట లంచగొండితనం ఎక్కువగావుంది. దాన్ని ఎలా తొలగించాలనే దానిమీద చాలామంది సభ్యులు సూచనలు చేశారు దాన్ని రెండువిధాలుగా చేయవచ్చు. Fairness to the staff itself అనేది ఒకటి. ఇప్పుడున్న చిన్న చిన్న ఉద్యోగులకు ఇప్పటికంటె ఎక్కువ న్యాయం కలుగచేస్తే వాళ్ళలో లంచకొండితనానికి అవకాశం వుండదు. కాని అది లేదు. కారణం ఏమంటే జీవితవ్యయం నానాటికీ పెరిగిపోతున్నా మన యంత్రాంగంలో ఉన్న ఖర్చు పెరుగుతున్నా వాళ్ళకు మాత్రం ఏమీచేసేది లేకుండా ఉంది. ఒక చిన్న దృష్టాంతరం. కృష్ణాజిల్లా N. G. O. లు M. L. A. లకు ఒక పుస్తకం అచ్చు కొట్టించి ఇచ్చారు. రెండు రకాలయిన ఉద్యోగాలున్నాయి. సెంట్రల్ ఉద్యోగులు ప్రావిన్షియల్ ఉద్యోగులు, ఒకరిప్రక్కన ఒకరు పనిచేస్తున్నారు. సెంట్రల్ ఉద్యోగంలో ఉన్నటువంటి ఒక ప్యూను 75 రూపాయలతో ప్రారంభిస్తే ప్రావిన్షియల్ లో ఉన్నటువంటి ఒక క్లార్కు 74 రూపాయలతో ప్రారంభిస్తున్నాడు. ఏమిటీ తేడా? ఈ ప్యూను నాకంటే ఎక్కువ ఏమిటి? That peon seems to be better than myself అనుకుంటాడు ఆ గుమాస్తా. వాడు వీడూ కూడా ప్రభుత్వకార్యక్రమాలే చేస్తున్నారు. ప్రావిన్షియల్ ఉద్యోగులలో ప్యూనుకు 41 రూపాయలు, 74 రూపాయలు Lower Division Clerk కు, U. D. C. కి 113 రూపాయలతో

వేతనాలు ప్రారంభమౌతాయి, ఆవిధంగానే సెంట్రల్‌లో తీసుకుంటే 75 రూపాయలు ప్యూనుకు, 112 రూపాయలు Lower Division Clerk కు, 132 రూపాయలు Upper Division Clerk కు వస్తాయి. ఈ తేడా ఎంత ఎక్కువగా ఉందో మనం గమనించవచ్చు ఈ చిన్న చిన్న జీతాలతో మనం జీవితం గడపటం చాలాకష్టం అనుకొని వారు కోరుతున్న కోరికలు నెరవేర్చడానికి ప్రభుత్వం పూనుకోలేదు. Central Pay Commission ఇచ్చిన సిఫార్సులను అమలుపరచడంలేదు.

అప్పుడెప్పుడో ఎవడో రాజ్యం ఏలుతున్నరోజుల్లో చిన్న వుద్యోగస్తునిమీద పై ఉద్యోగస్తుడు ఏమైనా వ్రాయవచ్చుననే నిబంధన పెట్టాడు. అప్పుడది వాడికి అవసరం. అప్పుడు కలెక్టరులందరూ ఇంగ్లీషు వాళ్ళే. వాళ్ళక్రింద పనిచేసే క్రింది ఉద్యోగస్తులమీద జబర్దస్తీచేసి లోతుపాతులు చూస్తేనే తప్ప రాజ్యాంగం నడపడం కష్టం. పైన వున్న ఉద్యోగస్తుడు క్రిందవాడిని గురించి ఏఅభిప్రాయంతోవున్నాడో తెలుసుకొని C. I. D. గా పనిచేస్తూ నల్లవాళ్ళమీద తెల్లవాళ్ళు జబర్దస్తీచేయడం కోసం ఆనాడు పరాయివాడు చూశాడు. చిన్న ఉద్యోగస్తుడికి పెద్ద ఉద్యోగస్తుడు ఆఫయిలులో ఏమివ్రాస్తున్నాడో తెలియదు. ఇష్టమువచ్చినట్లు వ్రాసెయ్యవచ్చు. ఇది చాలా అన్యాయము. దీనిని తీసివెయ్యాలని కాంగ్రెసువారుకమ్యూనిస్టులు అందరూ అన్నారు.

Sri T. N. VENKATASUBBA REDDI:— కాంగ్రెసు వారు పూర్తిగా ఈ పద్ధతి తొలగించాలని చెప్పలేదు. చిన్న ఉద్యోగస్తులమీద ఏదయినా adverse రిపోర్టుచేస్తే దానిని గురించి సంజాయిషీ చెప్పుకునే అవకాశం చిన్న ఉద్యోగస్తునికి కలుగజెయ్యాలని మాత్రమే చెప్పారు.

Sri T. NAGI REDDI :— చాలామంది వద్దన్నారు; కూడా, వెనుకటి అసెంబ్లీ ఉపన్యాసాలు తీసిచూస్తే తెలుస్తుంది. ఎవరైనా క్రింది ఆఫీసరుమీద వ్యతిరేకంగా వ్రాస్తే దానిని ఆ ఉద్యోగస్తునికిచ్చి దీని మీద నీ అభిప్రాయం ఏమిటని అడగడం జరగాలి అని మీరంటారు. ఇప్పుడు మనం ఒక పద్ధతి మంచిచెడ్డలు చూడవచ్చినప్పుడు ఏకారణంచేత

ఇది చెయ్యవలసివచ్చిందో, అది వుండడంవల్ల వచ్చిన లాభమేమిటో చూడాలి. అదివున్నది వున్నట్లు అమలు జరగడంవల్ల చాలా ప్రమాదం వుంది. కాబట్టి దానిని వెంటనే రద్దుచెయ్యాలి.

ఇక ఉద్యోగులకిచ్చే శలవుల విషయంలో కొన్ని సంవత్సరాల నుంచి అన్యాయం జరుగుతోంది. ఏ ఉద్యోగుడైనా తనఉద్యోగకాలంలో తనకు న్యాయంగా ఉపయోగించుకోడానికి వీలైన శలవులు కూడగట్టుకుని తనకు అవసరంవచ్చినప్పుడు ఉపయోగించుకోవచ్చు. కాని ఇప్పుడు 90 రోజులకన్న ఎక్కువ కూడబెట్టుకోకూడదు. వీటని ఉపయోగించుకోవాలి లేకపోతే కోల్పోవాలి అని వుంది. ఈ నిబంధనవల్ల చాలా నష్టాలున్నాయి. 90 రోజుల తర్వాత తనకుగాని, తన భార్యకుగాని వైదలి సౌకర్యాలకోసం శలవులంటే దొరకదన్నమాట. వెనుకవున్న శలవు రూల్సును ఇపుడు అమలుజరుపమని కోరుతున్నారు. ఇది చాలాసక్రమమైన కోరిక. ఈనాడు N. G. O. లలోవుండే అసంతృప్తిని తగ్గించకపోతే వాళ్ళు కష్టపడి పనిచెయ్యడానికి తగిన పరిస్థితులు కలుగచెయ్యడం లేదన్నమాట. దీనివల్ల corruption ను చాలావరకు తగ్గించవచ్చు. సంతృప్తి అనేదివుంటే లంచగొండితనం తగ్గుతుంది. లంచగొండి కేసులను strictగా విచారణ చెయ్యనందువల్లకూడా ఇది తగ్గడంలేదు. మేము ఈవిషయాన్ని గూర్చి కాంగ్రెసు మంత్రులతో చెపితే మీరుకూడా మాతో సహకరించండి, ఏవైనా లంచగొండి కేసులంటే మాతో చెపితే తప్పకుండా చర్యతీసుకుంటామని చెప్పారు. కాని మేము ఎన్నోపర్యాయాలు ఎన్నో కేసులు రిపోర్టు చేశాము కాని ఏవిధమైనచర్య తీసుకోలేదు. ఉదాహరణకు ఒక కలెక్టరు ఇన్సూరెన్సు ఏజెంటుగావుండి తనక్రిందవున్న ఉద్యోగస్తులను, గ్రామాలలో వున్న రెడ్లను కరణాలను ఉపయోగించుకొని బలవంతాన ఇన్సూరెన్సు చేయించాడు. దానిపై మేము రిపోర్టుచేశాము. దానికి తగిన సాక్ష్యాధారాలు యిస్తామని చెప్పాము. కాని ఏమీ చర్య తీసుకోలేదు. దీనిని బట్టి responsive cooperation కావాలని అడిగినందువల్ల ఏమీ లాభంలేదని విజ్ఞప్తి చేస్తున్నాను.

చాలామంది గిద్దలూరు తహసీల్ దారుకు ఉత్తరం యిస్తే దానిని తీసుకోడానికికూడా ఆయన నిరాకరించారు. ఆయన ఆ ప్రాంతానికి

ఒక dictator. బ్రిటీష్‌వాళ్ళ పాలననుంచి ఇట్లాగే జరుగుతోంది. ఏడు సంవత్సరాల స్వరాజ్యపాలన తర్వాతకూడా గ్రామసీమల్లో రైతులలోను కూలీలలోను ఉత్సాహం రాలేదంటే పరాయి ప్రభుత్వం ఈ యంత్రాంగాన్ని ఎల్లప్పుడు తన కనుకూలంగా వుండేటట్లు ఏర్పాటు చేసుకున్నదని స్పష్టమౌతోంది. ఇతర జిల్లాలలో వుండే గ్రామ మునసబుల సంగతి నాకు తెలియదుగాని రాయలసీమలోవుండే రెడ్ల సంగతి నాకు బాగా తెలుసు. కోటిరెడ్డిగారికికూడా బాగా తెలుసు. నేనుకూడా ఒక రెడ్డి (మునసబు) కుటుంబంలో పుట్టాను కనుక నాకు తెలుసు. వంశపారంపర్యంగా వస్తున్న ఆరెడ్ల పరిపాలన చాలా నిరంకుశంగావుంది. మనం వంశపారంపర్యంగా వస్తున్న రాజుల పరిపాలనను అంతమొందించామని చెపుతున్నాం. కాని గ్రామాలలో వుండే రెడ్ల పాలనను స్వస్తి చెప్పలేకుండా వున్నాము ఇది ఒక విధమైన class government కాబట్టి దీనిఇంకా కొనసాగిస్తోంది. తనకువున్న class ను, వర్గ విహిత సమాజాన్ని నిలబెట్టుకోవాలని ప్రయత్నం చేస్తోంది. ప్రభుత్వం వీరికి తరతరాలుగా అధికారంయిచ్చి ఇప్పుడు అమాంతంగా తీసివేయడానికి వప్పుకోదు. పంచాయితీలకు అధికారం ఇవ్వడానికి 7 సంవత్సరాలుగా కాంగ్రెసు ప్రభుత్వం ఏమి కృషిచేసింది, అందరికీ తెలుసు. శ్రీ కోటిరెడ్డిగారు 7 సంవత్సరాలుగా దానిని గురించి ఆలోచిస్తున్నాము అని బోర్డు ఆఫ్ రెవెన్యూనుగురించి మాట్లాడుతూ చెప్పారు. పరిపాలనా విధానంలో సమగ్రమైన, సంపూర్ణమైన మార్పులు చేయడానికి తగిన చర్యలు తీసుకోపోతే 7 సంవత్సరాల స్వతంత్రరాజ్యపాలనలో, గ్రామాలలోవున్న ప్రతివాడు నాకు స్వతంత్రంవచ్చింది, నేను స్వతంతంగా, సుఖంగా, బ్రతకడానికి అవకాశాలున్నాయి అని అనుకోడానికిగాని, నిరాశతో కుమిలిపోయే ప్రజానీకానికి ఆశ చూపించడముగాని అసంభవము. గ్రామంలో వున్న మాలవాడు మాదిగవాడు ఇంకా రెడ్డి చెప్పుచేతలలో వుండే రాజ్యాంగ విధానంలోనే వున్నారు. పరిపాలనా యంత్రాన్ని బ్రిటీషువారు పెట్టింది పెట్టినట్లు ఉపయోగించుకున్నాళ్లు, కోటిరెడ్డిగారు ఎంత మంచివారైనా 50 సంవత్సరాలు పరిపాలనచేసినా మన దేశానికి స్వతంత్రం వచ్చిందని సంతోషించడానికిగాని, స్వతంత్రంగా బ్రతకడానికిగాని సావకాశాలులేవు. మీరుచెప్పబోయేది మాకు తెలుసుననీ

శ్రీ కోటిరెడ్డిగారు ఒక్కమాటలో ఆలోచిస్తాము అని చెప్పకుండా వారేమి చెయ్యదలచుకొన్నారో, 1, 2, 3 సంగతులు సూటిగా చెప్పడము మంచిదనుకొంటాను, "ఆలోచిస్తున్నాము" అంచెప్పడం ఎంత తక్కువగా వాడితే అంత మంచిదని విజ్ఞప్తి చేస్తున్నాను.

The Hon. Sri. K. KOTI REDDI:— బహుశా ప్రతిపక్ష సభ్యుల అభిప్రాయము చూస్తే వ్యక్తి పరమైన విషయాన్ని గురించి ఉన్నదిగా కన్పడుతోంది. ఇప్పుడు వాటినిగురించి నేనేమీ తెలుపవలసిన అవసరం లేదనుకుంటాను. ఎందువలనంటే నాకు తెలిసినంతవరకు మీరంతా బడ్జెట్‌లోని కేటాయింపుల విషయం. బడ్జెటు గురించి చెప్పక వ్యక్తిపరంగా ఉద్యోగస్థులపైన, ఊళ్ళలో జరిగే విషయాల గురించి చెప్పినారు ఫలాని ఉద్యోగస్థులు, ఫలాని చెడ్డపని చేసినారని చెప్ప complaint చేశారు. ప్రతి పక్షంలోనివారంతా చాలా విషయాలను గురించి పరిశీలించి చెప్పారు. ఉద్యోగస్థులమీద చాలా మంది అనేక ఆరోపణలు చేశారు. ఈ బడ్జెటు demand ను గురించి కాక అన్ని విషయాలు general గా మాట్లాడారు. అసలు ఇప్పుడు ఇక్కడ ఈ బడ్జెటునుగురించి మాత్రమే general గా మాట్లాడవలసియుండినదిగాని వ్యక్తిపరమైన విషయాలను ఇంకా ఇతరవిషయాలను గురించి మాట్లాడవలసిన అవసరం లేదనుకుంటాను. అసలు ఈ లాంటి విషయాల నన్నిటిని గురించి మాట్లాడితే సమాధానం చెప్పడానికి వీలుగాఉండదు. General గా ఫలాని విషయాలను గురించి మాట్లాడబోతున్నామని ముందుగానే చెప్పినప్పుడే కొంతవరకు information చెప్పడానికి మాకు అవకాశం ఉంటుంది. వ్యక్తిపరమైన విషయాల గురించి నేను జవాబు చెప్పవలసిన అవసరం లేదనుకొంటాను. ఇది District Administration Demand అవడంవల్ల District పరిపాలనకు సంబంధించిన అన్ని Departments కు దీనితో సంబంధమున్నది. అన్ని Department లకు సంబంధించిన విషయాలను గురించి, వ్యక్తిపరమైన విషయాలను గురించి ప్రతివారికి సమాధానం ఈ 20 నిమిషాల వ్యవధిలో చెప్పాలంటే సాధ్యంకాదు. నాకు సంబంధించిన Department కు చెందిన విషయాలనుగురించి నేను చెప్పగలను. ముఖ్యంగా corruption కు

Sri K. Koti Reddi] [17th March 1954

పుచ్చుకుంటారు. దానిని వారు మామూలుగా మాత్రమే తీసుకుంటారు. అది కూడా లంచమే. బహుశా అది వారు మానలేరనుకుంటారు. అసలు అదికూడా లేకుండా, అసలు లంచమనేదే లేకుండా చేయడానికి ప్రభుత్వం ప్రయత్నించవలసి యున్నది. రెండవది ఈ corruption విషయంలో ప్రభుత్వం చాలా strict గా వుండవలెనని నాగిరెడ్డిగారు చెప్పారు. ఏదైనా enquiry వస్తే చాలా strict గా వుండాలని చెప్పారు. అదీ వాస్తవమే. ఏ ఆఫీసరుపైన అయినా లంచం తీసుకున్నాడని ఆరోపణ వస్తే దానిపై departmental enquiry చేయించుతాము. అసలు విషయం ఏమిటో తెలుసుకొంటాము. నా మట్టుకు నేను మాత్రం ఏ ఆఫీసరైనా ఏ condition లోనైనా, ఎటువంటి పరిస్థితిలోనైనా corruption చేశాడు అని తెలిస్తే అతడ్ని excuse చేయను. సాధ్యమైనంతవరకు corruption ను మాన్పించడానికి ఆలోచనలు జరుపుతున్నాము. ఏ విధంగాచేస్తే వాళ్లు లంచగొండితనం, యింకా యితరవిధములైన corruption మానుకుంటారు అనే విషయం ఆలోచనలోఉంది. అయితే నేను ఒకటిమాత్రమే చెప్తాను. ఇప్పుడు ఉద్యోగస్తులు లంచం తీసుకుంటున్నారంటున్నారు. అయితే ఇపుడు లంచం యిచ్చేవారుకూడా సగానికి బాధ్యులే. అందుచేత వారు కూడా "నేను లంచం యిచ్చాను" అని చెప్పరు. అందువల్ల ఈ corruption కేసులు రుజువుకాకుండా పోతున్నాయి. Prosecution విచారణ సమయంలో ఆ లంచంయిచ్చినవారు లంచంయిచ్చామని చెప్పరు. అందువల్ల కేసు రుజువుకాదు. అందువల్ల ఈ corruption పెరగడానికి లంచంయిచ్చేవారుకూడా బాధ్యులేనని చెప్తున్నాను. కేసు రుజువుకావడానికి సరైనసాక్ష్యంవుండదు. అందువల్ల దానిని C. I. D.-enquiry కి పంపడం జరుగుతుంది. తరువాత C. I. D. లు దర్యాప్తుచేసి report యిస్తారు. దానికేమైనా C. I. D. ని వేసి, వాళ్లు enquiry చేసిన తరువాత, వాళ్ళు యిచ్చినటువంటి report ను చూసి, దానిని గురించి ప్రభుత్వం ఆలోచించి దానికి ఏదైనా prima facie కేసుఉంటే దానిని Tribunal కు పంపితే public enquiry జరిపి నిజంగా అతను లంచం తీసుకుంటే, అది రుజువైతే అతను చేసిన నేరమును బట్టి శిక్ష విధించుతాము. లంచం యిచ్చే

వారు యివ్వడంవల్ల వారు లంచం యిచ్చినట్లు సరైన సాక్ష్యం యివ్వక పోవడంవల్ల ఈ విషయాలన్నీ సంభవించుతున్నాయి. ఒక వేళ లంచంయిచ్చేవారు తప్పనిసరియైన. అవాంతర పరిస్థితులలో లంచం ఇస్తే నేగాని పనిజరగద నే పరిస్థితిలో లంచంయిస్తే ఆయిచ్చినవాడు, ప్రైవేటుగా బైట లంచంయిచ్చినానని చెప్పినా, తరువాత prosecution enquiry లో మాత్రం చెప్పడు. ఈలోపల లంచంపుచ్చుకున్న ఉద్యోగస్థుడువచ్చి యితని కాళ్ళు కడుపుపట్టుకొని అలాచెప్పవద్దనిచెప్తే అతడు లంచం యిచ్చినట్లు చెప్పరు. అందువల్ల ఉద్యోగస్థులు corruption చేసిన వారు తప్పించుకొవటం జరుగుతోంది. అసలు సరైన evidence యివ్వకుండా annonymous petition పెట్టడం జరుగుతోంది.

ఫలానావారు యింత లంచం తీసుకున్నారు Sub-Registrar 5 నూర్లు రూపాయలు లంచంతీసుకున్నాడు అని annonymousగా పెటిషన్లు, complaints రావటమే కాని, అవి enquiry కి వచ్చినప్పుడు ఎవరూ సాక్ష్యం యివ్వడంగాని, రుజువుగాని, చేయలేక పోతున్నారు. ఊరికే complaints చేయడంమాత్రం చేస్తారు. సరైన రుజువులేకుండా, సాక్ష్యం లేకుండా వారిని ఎలా శిక్షించడం?

సాధ్యమైనంతవరకు, నా చేతుల్లో వున్నంతవరకు, లంచగొండితనం తగ్గించాలి అనే అనుకొంటున్నాను. ఏ విధంగా చేయాలి అన్న విషయం ఆలోచిస్తున్నాము. Dishonest officers ను promotion లేకుండా తగ్గించవచ్చు. Probationను కూడా ఆపుదల చేయవచ్చు. విచారణ చేసినపుడు సక్రమమైన సాక్ష్యాధారం లేకుండా ఏమిచేయడానికి వీలుపడదు. A sort of moral conviction వున్నపుడు కోర్టులో శిక్షించడం వీలుకాకపోయినా మంత్రులు చేతిలో వున్నది. Promotion అదీ వచ్చినప్పుడు పైకి రాకుండాచేయవచ్చును. కోర్టులో రుజువు కాకుండా పోయినపుడు, rebuke చేయడంద్వారా dishonesty తగ్గించాలి అనే ఆలోచనవున్నది. లంచం ఇచ్చినవాడు లంచం ఇచ్చినట్లు చెపితే, ఏఏ పరిస్థితుల్లో వాడు లంచం ఇవ్వవలసి వచ్చిందో విచారించి, వాడిమీద కేసులేకుండాచేసే అధికారం ప్రభుత్వంవారికి వున్నది. ఒక బ్లాకుమార్కెట్టుదారు ఉద్యోగస్థునికి

తన అవసరం నిమిత్తం లంచం ఇచ్చినపుడు, వానినికూడా వదిలేదిలేదు. ఒకఖూనీ చేసినవాణ్ణి రు 500 లు, రు 1000 లు ఇస్తే ఒక ఉద్యోగి తప్పిస్తాడు. అటువంటి కష్టపరిస్థితుల్లో వున్నప్పుడు లంచం ఇచ్చినా వానిని కేసునుంచి తప్పించి prosecution లేకుండా చేయవచ్చును. లంచగొండితనం అరికట్టాలంటే ఒక ప్రభుత్వం వల్లనేకాదు ఎవరైనా లంచగొండి వున్నాడంటే, దానివి తగిన సాక్ష్యాధారాలతో ప్రభుత్వం దృష్టికి తీసుకువస్తే action గట్టిగా తీసుకుంటాము.

Sri PILLALAMARRI VENKATESWARLU:— మీరు సహకరిస్తే అంతా జరుగుతుంది.

The Hon. Sri K. KOTI REDDI:— Certainly కాని చెప్పుడుమాటలునమ్మేవాణ్ణికాదు. తప్పుడు అంకెలుకూడ ఎన్నోవస్తాయి. Honest officers కొంతమంది వుంటారు. వారు లంచగొండితనానికి లొంగకపోతే, పిటిషన్లు పెడుతారు, టాన్స్ఫరు చేస్తారుకదా, తరువాత వచ్చేవాడు లంచగొండి కాకపోతాడా అని. అటువంటి సందర్భములలో honest officers ను కూడా రక్షించవలసిన అవసరంవుంది. ఒకప్పుడు జిల్లాకు జిల్లాజడ్జిని చేర్చి ఒక కమిటీనివేసి ఆ కమిటీకి కొంత అధికారం ఇస్తే, in cameraగానో ఎట్లానో విచారణచేసి oral conviction అయితే వాణ్ణి dismiss చేయడమో, ఏదోచేస్తే, కొంత బాగుపడుతుంది; ఆలాగే రాష్ట్రానికి అంతకీ ఒక కమిటీవేస్తే కొంతవరకు బాగుపడవచ్చు అనుకున్నాము. Suggestion కూడా చేసాము. ఈ కమిటీలు లంచగొండితనంచేస్తే ఎలా అన్నారు. నిజమే. అదికూడా జరుగుతూనే వుంటుంది. లేదని నేను అనను. దేనికైనా సాక్ష్యం కావాలి. అందరూ dishonest గా వుండరు. ఎటువంటి కష్టపరిస్థితుల్లోకూడా dishonest గా వుండనివారు వున్నారు. వారిని ప్రోత్సాహం చేయవలసిన బాధ్యతకూడా మనమీద వున్నది. నాచేతిల్లో వున్నంతవరకు dishonest గా వుండేవాళ్ళను పైకిరానిచ్చేవాణ్ణికాను. మిగిలిన విషయాలు Land Revenue Demand సమయంలో చెబుతాను. దేశాభివృద్ధి సాధించడానికి ఏ పార్టీ అయినా ఒకటే. మీకు మాకు అభిప్రాయాలు భేదాలువున్నా, దేశాభివృదినిసాధించడానికి కలిసే

పని చేయవచ్చును. కమ్యూనిస్టులు చెప్పారని ఏదీ నేను కాదనేవాణ్ణి కాదు. House sites గురించి చెప్పారు ఈ విషయంలో ఏ విధమైన జాగుచేయకుండా చూస్తామని ఇదివరకు సంగతి ఏమోగాని ఇప్పుడు ప్రభుత్వం శ్రద్ధతీసుకుంటోంది. House sites పూర్తిగా ఏర్పాటు చేయాలంటే కొన్ని లక్షలవరకు కావలసివస్తుంది. వచ్చే సంవత్సరం బడ్జెటులో కొంతవరకు provision ఏర్పాటు చేసేట్లా చూస్తాము.

Sri R. SIDDANNA GOWD:— పరిపాలనా విధానంలో తెచ్చే మార్పులను గురించి చెప్పవలసిందని కోరుచున్నాను.

The Hon. Sri K. KOTI REDDI:-మీరు ఎన్నో మార్పులను సూచించారు. అవి అన్నీ దీర్ఘంగా ఆలోచించి, ఎలాచేస్తే బాగుంటుందో, అలా చేస్తాము. ఈ వ్యవస్థ 100 సంవత్సరాలనుంచి వున్నది. చాలా పాతది. మంచిది అని నేనను. సారాకూడా పాతదే. ఇంగ్లండులో బ్రాందీ పాతదైన కొద్ది ఖరీదు ఎక్కువ. అయితే పాతదాన్ని మార్చేటప్పుడు దీర్ఘంగా ఆలోచించాలి. సాధక బాధకాలు అన్నీ ఆలోచన చేయవలసి వుంటుంది. అందుచేత మీ cut motions withdraw చేసుకుని Demand pass చేయవలసినదిగా కోరుచున్నాను.

Mr. SPEAKER:—The question is:

"That the allotment of Rs. 2,72,38,500 under Demand XI-District Administration and Miscellaneous, be reduced by Rs. 100."

The motion was lost.

Mr. SPEAKER:—The question is:

"That the Government be granted a sum not exceeding Rs. 2,72,38,500 under Demand XI-District Administration and Miscellaneous."

The motion was carried and the Grant was made.

## DEMAND No. XXXII
## COMMUNITY DEVELOPMENT PROJECTS.

The Hon. Sri D. SANJIVAYYA:—Mr. Speaker, Sir, On the recommendation of the Governor I beg to move that Government be granted a sum not exceeding Rs. 36,15,200 under Demand XXXII-Community Development Projects.

అధ్యక్షా, ఈ కమ్యూనిటీ ప్రాజెక్టులు ఆంధ్రరాష్ట్రంలో రెండు ఉన్నవి. ఒకటి సామర్లకోట, పెద్దాపురం ఏరియాలోను, రెండవది K. C. కెనాలు ఏరియాలోను. ఇది కడప కర్నూలు జిల్లాలకు మొదటిది తూర్పుగోదావరి జిల్లాకు ఉపకరిస్తవి. భారత ప్రభుత్వం అమెరికా ప్రభుత్వంతో టెక్నికలు కోఆపరేషను అగ్రిమెంటుక్రింద సహాయం పొందుతూ భారతదేశంలో దాదాపు 50 కమ్యూనిటీ ప్రాజెక్టులను ఏర్పాటుచేసినారు. అందులో ఆంధ్రదేశంలో రెండుమాత్రం ఉన్నవి. ఈ సంవత్సరానికి మరిరెండు చోట్లకూడా మంజూరుచేసినట్లు గౌరవనీయులైన సభ్యులు తెలుసుకొని ఉంటారు. ఒకటి శ్రీకాకుళం జిల్లాలో ఇచ్ఛాపురంలోను, చిత్తూరుజిల్లా వాయల్పాడు జిల్లాలోను ప్రవేశపెడుతున్నాము. ఈ ప్రాజెక్టుల ముఖ్యోద్దేశము ఏమిటంటే "To drive away poverty disease and ignorance." వీటిని సాధ్యమైనంత వరకు నిర్మూలించడమే ప్రభుత్వ ఉద్దేశం. ఈ సందర్భములో అసలు పని ఎంతవరకు జరిగిందో చెప్పవలెనని నేను అనుకుంటున్నాను. ఏఏ ప్రాజక్టులలో ఎంతెంతపని జరిగిందో నేను చదువుతాను.

నూరు గ్రామాలకుగాని, 150—170 square miles ఏరియాగాని, 67 వేల జనాభాకగాని ఈ ప్రాజక్టులు సంబంధించి ఉంటాయి. ఈ మూడు కండిషన్లు satisfy చెయ్యవలయును.

## KURNOOL - CUDDAPAH CANAL PROJECT.

Compost pits laid 279,

Manure pits properly covered 1141

Demonstration plots laid 23

Vegetable cultivation 692 acres

Contour bunding 166 acres

Bull-dozer and tractor cultivation 729 acres

Pests treated 411 acres

Fertilisers distributed for an area of 1500 acres: 720 tons 5 lbs.

Green manure seeds sold for supplying green manure in respect of 1160 acres.

One irrigation work is completed and 15 irrigation pumpsets have been secured to ryots in the project area.

No reclamation work has been undertaken so far, though a few schemes are being worked out.

Under Veterinary, activity has been confined up to now to treating sick animals of villages and fighting contageous diseases. The following are some figures of work done:—

Number of castrations done is 371;

Number of contageous diseases treated is 141;

Number of non-contageous diseases treated is 3,588;

Number of preventive inoculations performed is: Rinderpest 3507

| | |
|---|---|
| Halmorrasic septicaemia | 3211 |
| Ranikat vaccinating | 1287 |
| Sheep pox vaccination | 600 |
| Total inoculations | 8605 |

Anti-rabic treatment has been given to 5 animals

Number of sheep dewormed is 5505

Under Health and Sanitation, I have to say that one primary

Health Centre has been started and is functioning from 4—1—53

The building for this Centre is being constructed and is expected to be completed before 31-3-1954. The Health Centre's record of work in brief is as follows:—

| | |
|---|---|
| Number of patients attended | 46,444 |
| Number of maternity cases attended | 18 |
| Minor operations done | 158 |

Drinking water supply has been attended to in 22 villages.

Out of the 26 wells sanctioned, 11 wells have been completed and others are in progress. Ten latrines have been constructed. Estimates for over 100 of them have already been prepared.

*Communications.* Roads representing total milage of ten miles are under construction, one of them has been completed and six more are nearing completion.

*Education.* Elementary school buildings are nearing completion.

*Social Education.* Social education by way of training adults is in progress. Six centres are functioning. A dozen organised recreation clubs are being assisted for games materials on a contribution basis. In two villages dramatic troupes have been started and it is expected that as many as a dozen will be functioning very soon. Over 20 Harikatha Kalakshepams (Laughter) attended by thousands of people have been actually organised and put through. There are six youth leagues organised now for cleaning campaigns in villages.

*Co-operation.* Four new multi-purpose societies have been started afresh in addition to the sixty already functioning in the project areas. Dormant societies are being revived.

*Rural Arts and Crafts.* There was no progress under this programme pending formulation of the schemes.

*East Godavari District.*

*Agriculture.* Improved methods of cultivation was much in evidence in the project area. Distribution of improved strains of seeds, use of green manures and chemical fertilisers, vegetables and fruit cultivation was also perceptible. Plant protection work was undertaken in the area. The factual presentation is given below.

| | |
|---|---|
| Area under improved strains of paddy acres. | 1,13,423 |
| Compost pits laid | 134 |
| Demonstration plots | 355 |
| Plant protection work | 2452 |
| Fertilisers distributed | 1010 tons. |
| Green manure seeds | 9720 acres. |

*Irrigation.* The Thulyabhaga Lift Irrigation Scheme has been completed. The scheme makes provision for utilising the surplus drain water flowing in the Thulyabhaga drain by pumping it with the aid of electricity. The scheme provides irrigation facilities to one thousand acres of land besides providing water for the early raising of seed beds for about 1400 acres The Community Projects Administration have advanced a loan of Rs. 1 lakh to the Electricity Department for supplying power to the pumping installation. The ryots to be benefitted by the scheme have formed themselves into a co-operative society and have borne the entire cost of the equipment and installation charges amounting to Rs. 72,000. During the second crop of fasli 1362 paddy in an extent of 326 acres and sugarcane in 200 acres were raised with the help of the two out of the pumpsets installed in March 1953. 3,260 bags of paddy valued at Rs. 75,200 was grown.

*The Biccavole-Lingala Tank Lift Irrigation Scheme.*

The scheme is designed to pump water from Samalkota canal to the Longala Tank for being stored and used for irrigation. The scheme is expected to stabilise first crop irrigation of 500 acres and to afford irrigation facilities to about 250 acres during the second crop season. The Co-operative Society formed for the purpose have invested Rs. 20,000 and purchased the pump-sets and raised a pucca pump house. No funds were granted from the Community Projects Administration.

*Animal Husbandry.* One Veterinary Dispensary at Rayavaram (located in a gifted building) and three veterinary aid centres at Kapileswaram, Mandapeta and Anaparthi have been started. The work done in these institutions is given below.

Number of cases treated is 4250
Number of castrations made is 704
Number of cattle treated is 5342

*Health and Sanitation.* Three primary health centres at Karapa, Kirlampudi and Mandapeta and nine maternity centres at Tapeswaram, Teki, Kotipalli, Jagannadhagiri, Samalkot, G. Medapadu Geddanapalli, Kandrakota and Pulimeru have been started in the project. The work turned out in these institutions is as given under.

*Primary Health Centres.*

| | |
|---|---|
| Number of cases treated is | 1,42,388 |
| Number of operations made | 239 |

*Maternity Centres.*

| | |
|---|---|
| Antinatal cases treated | 4,514 |
| Number of labour cases attended | 590 |
| Post-natal cases attended | 3,527 |

*Sanitation*

69 tanks and 415 wells were cleaned. 51 tanks and 443 wells were chlorinated. 61,470 inoculations for cholera were performed. Besides control measures against filaria and guinea worm are also reported to have been undertaken.

Under Communications, one road work out of the four sanctioned is in progress. Under Education, improvement to 26 school buildings are reported to be under way.

*Adult and Social Education.* 61 adult schools, 21 recreation centres have been opened. 49 film shows, 36 social dramas and burrakathas have been given. 22 youth organisations are reported to have been formed. 201 meetings and group discussions are reported to have been conducted. 4 libraries and 11 reading rooms have been opened.

Under Co-operation, two lift irrigation societies have been organised. Registration of about 11 more societies is pending.

Under Rural Arts and Crafts, the detailed programme has not been finalised. Pending this, however, one Poultry demonstration unit and one apiary scheme have been started. The total expenditure incurred upto 30—11—1953 is Rs. 6,70,036-3-11.

ఇంతవరకు జరిగినపని వివరించాను. తక్కిన వివరములను ఈ డిమాండు ఆఖరున నాఅంత్య ఉపన్యాసములో చెబుతాను.

Information కావాలంటే తప్పకుండ నేను నాఆఖరు ఉపన్యాసములో చెప్పుతాను. figures ప్రకారం యింతవరకు 98 లక్షలు ఖర్చు అయింది. నా అంత్య ఉపన్యాసములో అన్ని తెలియజేస్తాను.

Mr. SPEAKER:— The motion is:

That Government be granted a sum not exceeding Rs. 36,15,200 under Demand No. XXXII - Community Development Projects.

Sri R. Sidhanna Gowd will move his cut motion formally.

Sri R. SIDHANNA GOWD:— Mr. Speaker, Sir, I beg to move:

To reduce the allotment of Rs. 36,15,200 under Demand No. XXXII-Community Development Projects by Rs. 100.

అధ్యక్షా! నా కోత తీర్మానాన్ని ప్రతిపాదించుతున్నాను.

Hon. Chairman:- కోత తీర్మానముపై చర్చ జరిగిస్తాము. కొర్రిపాటి పట్టాభిరామయ్యగారు మాట్లాడుతారు.

Sri K. PATTABHIRAMAIAH:— అధ్యక్షా! యీ community projects ను గురించిన వివరాలు సామర్లకోట ప్రాజెక్టు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరులైన బాపినీడుగారు Feb. 12వ తేదీన ఆంధ్రప్రభ ప్రత్యేకసంచికలో వ్రాసారు. అందులో వారి భాషా చాతుర్యమే హెచ్చు ప్రాజెక్టు చేసిన పనులు స్వల్పం. యీ ప్రాజెక్టులు ప్రజలచే నిర్వహింపబడుతాయని ప్రణాళికకు సంబంధించిన సహాయము ప్రజల ద్వారా వస్తుంది కాబట్టి సమిష్టి ప్రణాళికలు అని చెప్పబడుతువుంటాయి. కాని నిజానికి జరుగవలసిందేమి లేదని చెప్పాలి. కారణమేమిటి. అందులో చాల ద్వంద్వమున్నది. అది అమెరికా భారతదేశ కలియికతోటినిర్వహింపబడుతుంది. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు నిర్వహించుచున్నా కూడా దీనిలో ప్రజల సహకారమేమి లేదు. ఇందులో కొంత దురుద్దేశముంది. ఉద్యమాలను దెబ్బకొట్టుటకు ఉద్దేశింపబడ్డది స్కీము. ప్రత్యేకమైన ఉద్దేశాలతో అంతర్జాతీయశక్తులు కొన్ని దేశములోవున్న శక్తులు కొన్ని స్థానికంగా వున్నవాటినిస్వార్థానికి ఉపయోగించుకుంటున్నాయని స్పష్టమౌతుంది. ఇప్పుడుమనఆంధ్రదేశంలో రెండు community projects

వున్నాయి 1½ సంవత్సరమైంది ఏమి అభివృద్ధికనపడలేదు. యీ ప్రాజెక్టులున్న ప్రాంతాలన్ని కామధేనువులై పోతాయని రచించారు. కాని మరొక విధంగావున్నాయి. ఉదాహరణకు తూర్పు గోదావరిజిల్లాలో 242 గ్రామాలు అందులోవున్నాయి. పై 42 గ్రామాలకైన ఉపయోగము జరుగలేదనిచెప్పాలి. ఇందుకు ప్రధానమైన రాజకీయ కారణాలున్నాయి. ఆ ప్రాంతములో స్పష్టంగా తెలిసివుంది. కొద్ది గ్రామాలు కలసిరావడము లేదంటున్నారు. ప్రజలలో చైతన్యము తక్కువా? సహకారాన్ని సంపాదించడానికి కృషిచేయడములేదు. యీ సందర్భములోనే గడచిన ఫిబ్రవరి 15 తేదీన ప్రాజెక్టు ప్రాంతములో జరిగిన పనిని చూపెట్టడానికి Project Officers కొంతమంది M. L. As ను తీసికెళ్ళినారు. మేము చూచాము. చిక్కవోలు లింగాల ప్రాజెక్టుల రైతులు మమ్ములను కలుసుకున్నారు. జరిగిన అన్యాయముచెప్పి గోలపెట్టారు. తుల్యభాగు ప్రాజెక్టు బాగా ఉపయోగకరంగావుంది. దానికి మాజీ M. L. C. గారు చాల కృషిచేస్తున్నారు. దీనికి సహాయపడినందుకు నేను సంతోషిస్తున్నాను. అక్కడ Co-operative society యే ర్పా టు చే శా రు. ఈనాటి ఉద్యోగుల అశ్రద్ధవల్ల అక్కడ Electricity యివ్వకుండాపోయింది. అందువల్ల వచ్చేపంటకు నీరు సరఫరా కాదు. మరికొన్నింటి విషయములో కొన్ని మంచిసూచనలే వున్నాయి. Filter Points, Lift System లో నీటిని తోడడానికి ఉద్దేశింపబడుతున్నది.

ఇంతవరకు చాలపనులు ఆచరణలోకి రాలేదు అంటున్నారు. ఏకారణంచేత యింకా రాలేదో బాపినీడుగారి report చదివితే అర్థమౌతుంది. ఆలోచిస్తున్నామని, వూహిస్తున్నామని, వుద్దేశింపబడుతున్నదని ఈ విధముగా గందరగోళముగా వున్నది.

ఆరోగ్యం గురించి మూడు ఆసుపత్రిలున్నాయని చెప్పారు. నిజమే. కిర్లంపూడి ఆసుపత్రిలో రోజుకు 200 మంది రోగులు వస్తున్నారు కాని అక్కడ మంచి మందులులేవు. మండపేట ఆసుపత్రిలో 25 మంది మాత్రమే రోగులు వస్తున్నారని అన్నారు. దానికి కారణము మందులు లేకపోవటమే. మండపేట ఆసుపత్రి గురించి గవర్నరుకు చెప్పబడింది. ఆ తరువాత అక్కడ కొన్ని ఆసుపత్రులను ఎత్తివేశామని చెప్పారట. ఆ

ప్రాంతములో కొన్ని రోగములకు తగిన చికిత్స లేదు. బోద కుష్ఠు, "వినిరియల్సు" మొదలైన రోగములకు చికిత్స ప్రభుత్వం యేమాత్రం కృషిచేయటము లేదు. అంకెలలో మాత్రం, ఖర్చుపెట్టుతున్నట్లు గారడీ చేస్తున్నారు. అక్కడక్కడ D. D. T. పొడరు చల్లిస్తున్నామని చెప్పారు. మండపేటలో ఆ మధ్యను D. D. T. ని చల్లించారు. ఉపయోగం జరిగింది. కాని, మానివేసిన తరువాత, మళ్ళీవచ్చాయి. నిజంగా ఆరోగ్యమునకు 36 లక్షలు చాలవు. 36 కోట్లు ఖర్చుపెట్టినా మంచిదే. పశువైద్యం నామమాత్రముగా చేస్తున్నారు తప్ప. మరేమీగాదు. తూర్పుగోదావరి జిల్లాలో పశువైద్యమునకు, తగిన ఏర్పాట్లు లేవు. ఈనాడు నిరుద్యోగం దేశంలో ఎక్కువగా వున్నది. కుటీర పరిశ్రమలు అభివృద్ధి చేయటము వారి ఉద్దేశ్యమేగాని ఏవిధంగా జరుగుతున్నవి ఎన్ని ఆచరణలోకి వచ్చాయి. కోళ్ల పరిశ్రమ పెట్టారు. దానికిగాను ఖర్చు 1200 రూపాయలు పెట్టారు. 5 కోళ్ళకు ఇంత డబ్బు ఖర్చు పెట్టుతున్నందుకు ఆశ్చర్యపడుతున్నామని గుర్తించుకోవాలి. తక్కువ ఖర్చుతో - ఎక్కువ లాభముగావుండే పనులను చేస్తే - బాగుంటుంది.

Latrines విషయములో మంచి నమోనాలువున్నవి, ఇటువంటివి సామర్లకోటలోవున్నవి. కాని గ్రామాలలో లేవు. సంచార లైబ్రరీలు బాగా అచరణలో లేవు. ప్రాజక్టు కార్యక్రమ నిర్వహణకు, ఒక కమిటీని వెయ్యాలి. - ఆ కమిటీలో ప్రజలయొక్క బాధ్యతలు తెలియని పెద్దలను పెట్టకుండా - ప్రజలమధ్యను తిరిగే వారిని ఆ ప్రాంతములోని M. L. A. లతో కూడ కొన్నటువంటి ఒక కమిటీని వేసి, వారిసలహా ద్వారా చేస్తే బాగుంటుంది. ఇందులకు ప్రజల సహకారము కావాలంటే, ప్రజలలో సంచారము కావాలి. కొన్నిలక్షలు వుద్యోగస్థుల జీతాలకు ఖర్చు అయిపోతున్నవి. అందులో కొంతభాగము వరకైనా ప్రజలలో ప్రచారమునకు వినియోగిస్తే చాలా బాగుంటుంది. ప్రాజక్టుల వ్యవహారాలకు సామ్ము పూవాలి. ఈ ప్రాజెక్టులకు సంబంధించినవి జిల్లాబోర్డులకు, పంచాయితీ బోర్డులకువలె ప్రాజక్టుపనులుకూడ తొందరగా జరుగకుండా అడ్డంకులు కల్పింపబడుతున్నాయి. వీటికి ఆటంకాలు డిపార్టుమెంట్లవల్ల లేకుండా జరిగేటట్లు చూడాలి. పేదప్రజలు లాభంపొందేటట్లుగా చూడాలి.

గృహవసతి విషయములో 1952 అక్టోబరు 1వ తేదీన ఒక Model (మోడల్) ఇల్లుకట్టారు. అంతకుతప్ప పేదవాళ్ళకు ఇళ్లు కట్టుకోటానికి సహాయం లేకుండా వున్నదని మనవిచేస్తున్నాను. దీనికి ప్రత్యేక శ్రద్ధచూపాలి.

సహకారమును గురించి. సహకార ఉద్యమాలు, వుండవేవున్నవి. వాటి లక్ష్యములను ప్రజలలో ప్రచారముచేసి, అట్టివి గుర్తింపబడేటట్లు చేయాలి. ఇది జరగటంలేదని చెప్పాలి. 5, 6 గ్రామాలలో గైడ్సు వుండాలి అట్టివారులేరు. వెంటనే శిక్షణపొందిన, అనుభవం పొందిన గైడ్సును పెట్టితే, చాలా ఉపయోగంగా వుంటుంది. దానివల్ల చాలా ఉపయోగాలు జరుగుతాయికూడా. ఎరువుల పంపకము విషయములో కొద్దిమందికే యివ్వబడుతున్నవి. ఈ విషయమును గమనించవలసినదిగా కోరుచున్నాను. గోదావరి వరదల ముంపువల్ల, రామచంద్రపురం, కూనూరు తాలూకాలలో చాలానష్టము సంభవించినది. అచ్చట స్కూళ్లు చాలా పాడైపోయినవి. జిల్లాబోర్డు స్కూళ్లు, పంచాయితీబోర్డు స్కూళ్ళకు మరమ్మతులు చేయించాలి. కొన్నిటిని మాత్రమె చేస్తున్నారు.

ఈనాడు హరిజనోద్ధరణకు బాపినీడుగారు అక్కడ హరిజనులను ఉద్ధరించే గొప్ప కార్యక్రమము ఒకటి చేశారు. 7, 8, సంవత్సరముల వయస్సుగల 5గురు హరిజనపిల్లలకు, శారదా ఆక్టుకు విరుద్ధంగా పెండ్లిండ్లు చేశారు. తరువాత, వారిమీద case పెట్టడముకూడా జరిగింది. కాని కొంతమంది అధికారుల అనుగ్రహమువల్ల ఆ ప్రమాదము తప్పిపోయింది. ఇలాంటివన్ని కొంచెం జాగ్రత్తగా ఆలోచించాలి. ప్రజా ప్రతినిధులు ఎప్పటి కప్పుడు తగినచర్యలు తీసుకుంటూ డబ్బు సద్వినియోగము అగు నట్లు చూడాలని కోరుతున్నాను.

కమ్యూనిటీ ప్రాజెక్టులు, National Extension Schemes అందరిసహకారము వున్నప్పుడే, బాగాజరుగుతవి. కంట్రాక్టు విషయంలో చాలా లోపాలు జరుగుచున్నవి. తూర్పు గోదావరిలో ఒకచోట పందిళ్లు వేయుటానికి పశ్చిమ గోదావరినుండి కంట్రాక్టరును పిలిపించి యివ్వ వల సిన అగత్యం వచ్చిందంటే – ఇదేమో చాలా ఆశ్చర్యముగా వున్నది. మామూలు పందిళ్ళకు 6 వేలు ఖర్చు అయిందంటే, ఆశ్చర్యంగా వున్నది.

ఇవి జాగ్రత్తగా జరగాలంటే – ప్రజల సహకారం – ప్రజా కమిటీలు వున్నప్పుడే జరుగుతుంది.

Sri RAJA V. V. KRISHNAMARAJA BAHADUR:— అధ్యక్షా, ఈ Community Projects Demandను నేను బలపరుస్తూ ఈ విషయములో కొన్ని సూచనలు చేయదలచాను. ఇదివరకు మాట్లాడినటువంటి సోదర సభ్యులు కొండ్రపాటి పట్టాభిరామయ్యగారు ఈ విషయంలో చాలా విమర్శించారు అయితే తూర్పు గోదావరి జిల్లాలోని కమ్యూనిటీ ప్రాజెక్టులో ఉన్నటువంటి major portion అంతా ఈయన locality కి చెందినటువంటిదే. కనుక దానికి సంబంధించిన విషయాలన్ని ఆయనకు బాగా తెలిసియుండవచ్చు. ఈ కమ్యూనిటీ ప్రాజెక్టు పనులకు ప్రజల సహకారం చాలా అవసరమని చెప్పారు. నిజంగా ప్రజల సహకారంలేనిదీ, ఏ పనిగాని, జరుగదు. దీనిలో ఎవరికీ భేదాభిప్రాయం ఉండవలసిన అవసరంలేదు.

రెండవది community projects యొక్క సూత్రాన్ని బట్టి చూస్తే, ఎక్కడైతే water facility ఉంటుందో, అక్కడే ఇది ఏర్పాటు చేయాలని అనుకొన్నారు. దీనికి ఇంతకంటె ప్రాధాన్యత. ఇవ్వవ ఇవ్వాలంటే, upland areas లోను rural areas లోను ప్రజలకు విద్యా వైద్య సౌకర్యాలు, transport వసతులు కలుగజేసేందుకు ఉపయోగిస్తే బాగుంటుందని ప్రతిపక్షసభ్యులు, మేము కూడ అనేక దఫాలు చెప్పాము. ఈ సందర్భంలో రామచంద్రాపురం కమ్యూనిటీ ప్రాజెక్టులో మా తుని తాలూకానుకూడ చేర్చవలెనని మనవిచేస్తున్నాను.

తరువాత, ఉమ్మడి రాష్ట్రంలో ఇదివరకు famine వచ్చినప్పుడు మా తుని, పెద్దాపురం తాలూకాలలో, రేనలపూడి కోటనందూరు రోడ్డుకుగాను, communication head క్రింద Hon. Minister పట్టాభిరామారావుగారు 20 వేలు రూపాయలు sanction చేశారు, ఆ పని జరుగుతూ ఉన్నది, అయితే ఈ రోజున నాకు ఒక trunk call వచ్చింది. 12 వందల labourers కు పనిలేకుండా ఆ పని ఆపుచేశారని information వచ్చింది. ఆపని 10 మైళ్ళవరకు అయినది.

[Sri Raja V. V. Krishnamaraja Bahudur

ఇంకా 4 మైళ్లు కావలసియున్నది. ఇంతలోనే ఇలాంటి సంఘటన జరిగింది. దీనిని ప్రభుత్వము దృష్టికి తీసుకొని ఈ పనిని పూర్తి చేయవలసిందని కోరుతున్నాను. ప్రస్తుత పరిస్థితులలో రైతుకూలీలకు ఎలాంటి పనిపాట్లు లేకుండా ఉన్నది. ఇలాంటి పరిస్థితులలో ఆ 12 వందల కూలీలను పని లేకుండా చేయడం చాలా కష్టంగా యుంటుంది. అందుచేత, ఈ కమ్యూనిటీ ప్రాజెక్టులక్రింద, 9,91,850 రూపాయలు provide చేసినటువంటి ఈ మొత్తములో కొంతభాగం ఈ రోడ్డుపనినికూడ పూర్తిచేయడానికి ఉపయోగించుకొని ఈ 12 వందల కూలీలకు పని కల్పించవలసిందని కోరుచున్నాను.

తరువాత ఈ కమ్యూనిటీ ప్రాజెక్టులో ఇదివరకు చేసినటువంటి పనులు గురించి కొత్రపాటి పట్టాభిరామయ్యగారు విమర్శిస్తూ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు అయిన మాగంటి బాపినీడుగారు 8 హరిజన బాలికలను, వివాహము చేశారు, ఇది వారు చేసిన పెద్దపని అని విమర్శించారు. అయితే, ఈ కమ్యూనిటీ ప్రాజెక్టులలో major, minor అని రెండు పనులున్నాయి. ఇది minor community project క్రింద వచ్చిందనుకోవచ్చును. కనుక దీన్ని గురించి విమర్శించ నక్కరలేదు. ఇది కూడ minor head క్రింద జరిగిందని ఒక విధంగా సంతోషపడవలసి యున్నది.

తరువాత పట్టాభిరామయ్యగారు ప్రతిదానికి ప్రజల సహకారము ఉండాలని విమర్శించారు. ప్రజల సహకారము లేనిదే ఏ గవర్నమెంటు పనిగాని, మరే పనిగాని జరుగదు. ప్రజల సహకారం కావాలంటే గవర్నమెంటు ప్రజలనుకూడ దగ్గరకు తీసుకొని వారు చెప్పిన సలహాలు తీసుకొంటూ, వాటిని గౌరవించవలసి యుంటుంది. ప్రజలుకూడ ముందుకు వచ్చి ప్రభుత్వానికి సహాయపడవలసి యుంటుంది. అయితే మనకు గవర్నమెంటుచేత పనులు చేయించవలసిన బాధ్యత ఉన్నది. కనుక ప్రతి చిన్నదానికి ఆక్షేపణ చేయడం జరిగితే, ప్రభుత్వం ఏపని చేయడానికి వీలుండదు. ఎక్కడెక్కడైతే నిజంగా అన్యాయం జరుగుతుందో, అక్కడ న్యాయం జరగాలని చెప్పవచ్చు. అటువంటిచోట విమర్శించవచ్చు గాని ప్రతిదాన్ని విమర్శించడం తగదు.

మొత్తంమీద గవర్నమెంటు కమ్యూనిటీ ప్రాజెక్టుల విషయంలో చేస్తున్నటువంటి పనిని కొనియాడతగినదని తెలుపుతూ ఇంతటితో నేను విరమిస్తున్నాను.

Sri R. SIDHANNA GOWD:—అధ్యక్షా, ఈ కొంత తీర్మానమును నేను ప్రతిపాదించినాను. గవర్నమెంటువారి ఉద్దేశ్యమేమో మహోజ్వలమైనది. ఉత్కృష్టమైనది. వారు సదుద్దేశ్యముతోనే ఈ ప్రణాళికను అమలులో పెట్టినను, దానిని జరుపుటకు మనుష్యులు కావలయును. ప్రజల సహకారముకూడ ఉండవలెను. ఇందుకుగాను project officers అనే వారిని ఏర్పాటు చేసినారు. వారికి ఒక కారుకూడ ఇచ్చినారు. వారిక్రింద ఒక్కొక్క ప్రాజెక్టుకు ఇద్దరు తాశీల్దారులను నియమించి వారికికూడ రెండు కార్లను ఇచ్చినారు. ఇంతేకాకుండా, వివిధశాఖల క్రింద ఉద్యోగులనుకూడ ఇచ్చినారు. ఆరోగ్యశాఖక్రింద Health Inspector ను ఇచ్చినారు. పశువుల ఆరోగ్యశాఖక్రింద Veterinary doctor ను ఇచ్చినారు. కొందరు Revenue Inspector ను, surveyors ను ఇచ్చినారు. ఇంకా Medical officers ను ఇచ్చినారు. Social Officer అనే ఒక ఆమెనుకూడ appoint చేసినారు. ఆమెకు, బత్తా కాక, నూరు, నూటయాభై రూపాయిలు జీతము ఇచ్చేటట్లు ఏర్పాటు చేసినారు. ప్రాజెక్టు ఆఫీసర్లకు కలెక్టరుగ్రేడులో, 800, 900 జీతము ఇచ్చారు. తాశీల్దార్లకు 200, 250 రూపాయలు బత్తాతోచేరి 300 రూపాయలు ఇస్తున్నారు. వీళ్ళందరిక్రింద గ్రామసేవకులు 40, 45 మంది ఉంటారు. ఇంతమందిని నియమించి ఇంతడబ్బు ఖర్చు చేయవలసియుంటుంది. ఇందులో గవర్నమెంటుయొక్క ఉద్దేశ్యము మంచిదే. అయినప్పటికి, దీనిని అమలులో పెట్టడానికి ఆదర్శపూర్వకమైన మనుష్యులు లేనందువల్ల దీనివలన లాభముకంటె ఎక్కువ ఖర్చుచేయడం జరుగుతున్నది. పని సంతృప్తికరముగా లేదని చెప్పుటకు చింతిల్లుచున్నాను. నేను K. C. Canal ప్రాజెక్టు చూచుట తటస్థించింది. దాన్నిగురించి నంద్యాలగ్రామంలో అనేకమంది ఉద్యోగస్తులను, అనేకమంది లాయర్లను సంప్రతించాను. ఈ విషయములో ఒకరుకూడ మంచి మాట చెప్పలేదు అని చెప్పుటకు నేను చాలా విచారపడుతున్నాను. ఈ ఆఫీసర్లు

కార్లమీద ఊరికే తిరుగుతూ వాటిని చాలా దురుపయోగం చేస్తున్నారు. ఈ గ్రామాలుకూడ చూచాను. పంచాయితీలున్న ఉంటే గ్రామములో ఒకమైలు రోడ్డు మాత్రము గ్రామప్రజల సహకారంతో వేసినారు. ఆ గ్రామములో చూచినట్లయితే పారిశుధ్యము చాలా హీనంగా ఉన్నది. ఎక్కడచూచిన encroachments, ఉంటాయి. ఎక్కడెంకా ఎక్కడ ఎరువులు, బచ్చలిసిళ్ళు, చాలా dirty గా ఉన్నవి. పారిశుధ్యము ఏంత మాత్రము తృప్తికరముగా ఉండలేదు. పంచాయితీ గ్రామాలలోకూడ. పారిశుధ్యము బాగాలేదు. ఎక్కడచూచిన మురికినీరు. కాలువలనుంచి, కాలువలనుంచి తెచ్చుకొని త్రాగుతూ యున్నారు. [illegible] ఏర్పాటుచేసియుండలేదు. రోడ్డుమాత్రము ప్రజల సహాయంతో ఏర్పా[illegible] చేసియుండిరి. కాని పారిశుధ్యం ఏమాత్రం తృప్తికరంగా యుండలేదు. ప్రభుత్వము lighting యేర్పాటు చేసియుండలేదు. 40, 45 మంది గ్రామసేవకులు పనిచేస్తున్నారు వీళ్లపైన సరియైన supervision ఉండి నట్లు కన్పడలేదు. అంతేకాకుండా social officer అనే ఆమెకు అంత డబ్బు ఇచ్చికూడ, గ్రామాలుచూచేందుకు ఆమెకు conveyance కూడ ఇవ్వకుండా, సరియైన చేయూత ఇవ్వకపోయినట్లయితే, ఆమె స్త్రీ అభ్యుదయానికి యేవిధంగా తోడ్పడగలదో నాకు తెలియకుండా ఉన్నది. ఇంతపని చేసినప్పటికిని, ఉపయోగంకంటె డబ్బు చాలా ఖర్చు అవు తున్నది.

ఈ విధంగా ప్రాజెక్టు ఆఫీసర్లను ఏర్పాటు చేయడం, వారికి కావలసినవారిని వారికి తోడ్పడటానికి నియమించు కోవడం అంతాచూస్తే యీపని అంతయు ప్రభుత్వము సక్రమంగాను, సమర్థనీయంగాను నడి పించ గలుగుతున్నదా అనేది పరిశీలించవలసిన అవశ్యకత చాలావున్నది. ఈ పనులకొరకు నియమింపబడ్డవారు ప్రభుత్వ పక్షములోని కాంగ్రెసు నాయకులు. వారు యీ పనికి నియమింపబడకముందు M. L. A. లుగాను M. L. C. లుగాను వుండినారు. వీరు అయినను క్రమపద్ధ తిలో యీపని జరిపించడము లేదని చెప్పటానికి చాలా సంకోచించు చున్నాను. వీరు చేయిస్తున్న పనిఅంతయు ఆరి తేరిన నిపుణుల చేత సక్రమమైనదనా, అక్రమమైనదనా, supervision exercise చేయవలసిన అవసరము కనబడుచున్నది. ఈ పనిని super-

Sri R. Sidhanna Gowd ] [ 17th March 1954

vise చేయటానికి ఆరితేరిన నిపుణులను వేయించినట్లయితే, బాగుండేది. కలెక్టర్లతో సమానంగా జీతాలు అనుభవించటానికి వీరిని ప్రభుత్వము ఏర్పాటుచేసినట్లు కనబడుచున్నదేకాని, వీరు చేయించేపని అంతకు తగినట్టుగా లేదని చెప్పటానికి నేను విచారపడుచున్నాను. ఈ పనిని supervise చేయటానికి కలెక్టర్లనుగాని, Revenue Divisional Officers ను గాని ప్రభుత్వం నియమించినట్లయితే ఎంతో బాగుండేది. పనులుగూడా సత్వరంగాను, సక్రమపద్ధతిలో జరుగుతూ వుండేవి. వీరిని ఏర్పాటుచేసి, వారిక్రింద వుద్యోగస్తులనే పనిచేయటానికి ఏర్పాటు చేసి యుండినట్లయితే, ప్రభుత్వం యింతవరకు చేయించిన పని ఎంతో సమర్థనీయముగా వుండేది. ఇంతే కాకుండా గ్రామాలలో గ్రామ సేవకులు అని 75 రూపాయలు జీతాలు యిస్తున్నారు వీరందరికి యీ జీతాలు సకాలములో యిస్తున్నారా, లేదా అనేది అనుమానాస్పదము. వారు చేసేపని ఎంతమాత్రము తృప్తికరంగాలేదని గ్రామాలలోని ప్రజల సహకారము కూడా తృప్తికరంగా లేదు. ప్రజల సహకారము లేనిదే యీ ప్రాజెక్టుల క్రింద తలపెట్టినపని జయప్రదముగా నడువజాలదు. Revenue Divisional Officers ను ఈ project officers గా నియమించియున్నట్లయితే వారియొక్క ఉద్యోగ ప్రాబల్యముచేత ప్రజల సహకారము కొంతవరకైనా లభించటానికి వీలువుండేది. ప్రజల సహకారము కావలసివుంటే ఏ రీతిలో కావలసి వస్తుంది? ఏ పద్ధతులలో ప్రజలు సహకరించి పనిచేయవలసి వస్తుంది. లేబరు పనిచేయాలంటే డబ్బుద్వారానా లేక ఏరూపములోవుండాలి? వారు ఎన్నిదినాలు వుచితముగా పనిచేయవలసివుంటుంది? ఎంతడబ్బు యివ్వవలసి వస్తుంది? ధనరూపముగా లేకపోతే ఐచ్ఛికంగా పనిచేయవలసి వస్తుందా? ధనవంతులు, పేదవాళ్లు కలసి ఎన్నిదినాలు పనిచేయవలసివుంటుంది. భూములకు పట్టాలు కలిగినవాళ్ళు పట్టాలు లేనివాళ్ళుకూడా ఎన్నిదినాలు పని చేయవలసివుంటుంది. ఈ వివరాలు అన్నియు వారి వారి status కు తగినట్లుగా యిన్ని దినాలుఅని నిర్ణయించి పనిచేయవలసి వుంటుందో, అంతయు పరిశీలించాల్సివున్నది. వీటి అన్నిటిదృష్ట్యా నిర్మాణాత్మకమైన సూచనలు చేయాలి.

తిరువాత District Administration విషయములో వుద్యోగస్థులలో వున్న అవకతవకలు వున్నవి. గ్రామ సేవకులు ఒక నిక్కైన పద్ధతితోను, దీక్షతోను పనిచేయవలసియుంటుంది. శ్రీ బాపినీడుగారేమి, వరదాచారిగారేమి, వీరిద్దరు ప్రజాసేవలో ఆరితేరినవారు. ప్రజలక్షేమ దృష్ట్యా, వారికిఉన్న పేరుప్రతిష్టల దృష్ట్యా యిటువంటివారు యీ పనికి రావడం అంత బాగుండదని నా అభిప్రాయం. ఇటువంటి పెద్దసేవ చేసినవారికి యిప్పుడువున్న మంత్రివర్గములోవున్న సంజీవయ్య వంటివారు వెళ్ళి సలహాలుయివ్వటానికి తగినవారుకారు. 30, 40 మంది గ్రామసేవకులను జీతాలుయిచ్చి ఏర్పరచారు. వీరందరివల్ల పని సక్రమముగా జరుగుతున్నదా అని పరిశీలించాల్సిన అవసరము కలదు. ప్రజా సంఘాలయొక్క assistance యీ ప్రాజెక్టుల నిర్వహణకు చాలా అవసరము. గ్రామాలలోవున్నవారు రాత్రింబగళ్ళు పనిచెయుటకు ముందుకు రావాలి. గ్రామస్తులను ప్రోత్సహించి యీపని సానుకూలము పడేటట్లుగా చేయాలి. ప్రతియొక్కరిని పిలిపించి గ్రామ పారిశుద్ధ్యము, ఎరువేయడము, అధికాహారోత్పత్తి చేయడమునకు తగినచర్య పుచ్చుకోవలెను. ఈ రకమైన కార్యక్రమానికి నెలకు 900 రూపాయలనిచ్చి ఒక ఆఫీసరును వేయడము అనవసరము ఈ కార్య నిర్వహణమునకై యిప్పుడున్న ప్రాజెక్టు ఆఫీసర్లను తీసివేసి ఏ రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు చేతిలోనో వుంచినట్లయితే, యీ ప్రాజెక్టు ముందుకు రావడానికి సావకాశాలుండగలవు. ఈ రివిన్యూ డివిజనల్ ఆఫీసరుకు, రివిన్యూ ఇన్‌స్పెక్టరును నియమించి, తగిన స్టాఫ్‌ను, అధికారమునిచ్చి వారు యీపని సమర్థతతో నిర్వహించాలనిచెప్పి ఏర్పాటుచేస్తే బాగుంటుంది. గ్రామాలలోని, ధనవంతులను, భూస్వాములను, పేదవారిని అందరిని mobilise చేసి యీ కార్యక్రమానికి దిగినట్లయితే, యీ ప్రాజెక్టులు ఎంలో శీఘ్రగతిని ముందుకు రాగలవని చెబుతూ, విరమిస్తున్నాను.

Sri K. V. RAMESAM:— అధ్యక్షా! ఈ community projects areas selection చేసే విషయములో నేను ఒకవిషయము చెప్పదలచాను. వ్యవసాయము విషయమై ప్రభుత్వము ఖర్చుచేసే విషయములో కాకుండా ముఖ్యంగా ఈ community projects develop చేయటానికి backward areas అంటే non-delta areas ను వెనుక

Sri K. V. Ramesam] [17th March 1954

బడిన ప్రాంతాలను వృద్ధిచేసే విషయము ప్రధానంగా తీసుకోవాలి. ఈ backward areas లో production వృద్ధి చేయాల్సి వున్నది. ఈ ఏరియాలు వృద్ధిచేయడం ప్రభుత్వముయొక్క బాధ్యత అని చెబుతున్నాను. ఈ backward areas లో irrigation sources ముందు దృష్టిలో పెట్టుకొని వృద్ధికి తేవాలి. రాయలసీమలో మాదిరిగా విశాఖపట్టణంలో గూడా చాలా ప్రదేశములు వెనుకబడివున్నవి. ఇక్కడి ప్రజలు రాయలసీమలో మాదిరిగా కరువుచేత బాధపడుచున్నారు. ఈ కరువు నివారించాలంటే ఈ ప్రాజెక్టులను develop చేయవలసిన అవసరమున్నది. వీరవల్లి తాలూకా యర్రవాయి ముఠా వున్నది. ఆముఠాలో సుమారు పైరుగ్రామాలకు పైగావున్నారు. కరువువల్ల బాధపడలేక ఈ గ్రామస్తులు మూరప్రాంతాలకు వలసవెళ్ళారు. ఈ ముఠావాళ్లే కాకుండా యింకా తాలూకాలోని 50, 60 వేలు మంది ప్రజలు భూములు విడిచిపెట్టి వలసపోయారు. Community ప్రాజెక్టులు యీ ప్రాంతాలలో develop చేసేటట్లయితే, యీ ముఠావాళ్లు, గ్రామాలలోని ప్రజలు సహకరించటానికి సిద్ధగావున్నారు. సభ్యులు చేసిన సూచనలనుబట్టి ముఖ్యంగా ఈ ప్రాజెక్టులు వెనుకబడిన ప్రాంతాలలో ప్రవేశపెట్టి develop చేయాలని స్పష్టమగుచున్నది ముందుగా backward areas ను వృద్ధికి తెచ్చి, తరువాత delta areas విషయము చూడవచ్చునని నా సూచన. పేదప్రజలకు పనులు కల్పించవలసిన సమయము వచ్చింది. ఈ కమ్యూనిటి ప్రాజెక్టులకుగాను ప్రభుత్వమువారు ఏర్పాటుచేసిన సిబ్బందిని చూడగా వాటికి యాభైవంతులు పైగా ఈ సిబ్బందికొరకే ఖర్చు అవుతున్నట్లు కనబడుచున్నది. ప్రభుత్వమువారు యిచ్చేడబ్బులో యీ సిబ్బందికే, సగము ఖర్చు అయితే. ప్రాజెక్టు నిర్వహణ ఏవిధంగా జరుగుతుందో గ్రహించాలి. ఈ ప్రాజెక్టులు ప్రజలకు ఉపయోగపడక పోవటం మూలాన, ప్రజల సహకారము లభించడములేదు. లేకపోతే ప్రజలు ఎందుకు సహకరించరంటున్నాను. ప్రాజెక్టులు సిబ్బందికొరకు ఏర్పాటుచేశారా, ప్రజలకొరకా! కొంత సిబ్బందిని తొలిగిస్తేనేకాని, ప్రజలలో ఉత్సాహము, సహకారము లభించదు. ఎక్కడైతే ప్రజల సహకారము పొందపీలగునో అక్కడ ముందుగా ఈ ప్రాజెక్టులు ప్రవేశపెట్టాలని నా అభిప్రాయము.

కాకపోతే ఏమాత్రము ప్రయోజనము కల్పించదు. ఇకముందైన మన ప్రభుత్వంవారు తలపెట్టబోవునటువంటి National Extension Schemes ను ఏస్థలాలలో ఉపయోగపడగలవో ముందుగానిర్ణయించి, ఆ కోట్లలో ప్రజల సలహాలకు తగినట్లుగా ఏర్పాటుచేయించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ, యింతటితో విరమిస్తున్నాను.

* Sri T. LAKSHMINARAYANA REDDI :— యీ cut motion ను బలపరుస్తున్నాను. Community projects ద్వారా మనదేశంలో ప్రజలు సంతోషముతో జీవితమును గడుపుటకు అవకాశము కలిగినా మనం తప్పకుండా సంతోషిస్తాము. ఈ community projects ద్వారా మనము అభివృద్ధి చెందుతామో, లేదో అనేది సుదీర్ఘంగా ఆలోచించాలి. సిద్ధన్న గౌడుగారు మనవిచేసినవాటితో నేను సంపూర్ణంగా యేకీభవిస్తున్నాను. ఈనాడు ప్రజాప్రభుత్వ మనుపించుకొనెడి ఈ కాంగ్రెసు ప్రభుత్వము పూనుకొన్న ఈ అభివృద్ధి ప్రణాళిక పని వెనుక కొంత కుట్ర వుందని మీ అందరి దృష్టికి తీసుకొని రావలసివున్నది. హిందూ దేశములో బహు సంఖ్యాకముగా technical experts వుండగా, విదేశీయ సహాయమనే పేరుతో, America technical co-operation యిస్తున్నదని చెప్పి వారి technical experts యొక్క సహాయమును తీసుకొని, రాష్ట్ర ప్రభుత్వములపై రుద్దుట, రాష్ట్ర ప్రభుత్వములకు వారికి ఖచ్చితమైన నిశ్చితాభిప్రాయములను లేకుండజేయుట చాలావిచారకరము. అదువల్లనే ఈ శాసన సభలో నేడు పలువురు అమెరికాయొక్క technical co-operation ను గూర్చి విమర్శించినారు. దేశములోని పత్రికలు, లోకసభలోని సభ్యులు పలువిధముల నిశితవిమర్శలనుజేసిరి. ఇట్టిపరిస్థితులనుండి దేశమునుకాపాడ వలెననే వుద్దేశ్యంతో, అమెరికావారు ఇచ్చుచున్నటువంటి technical సహాయమును బడసి, హిందూదేశ సాధన సంపత్తిని దుర్వినియోగపర్చ వద్దని, కోరుతున్నాను. మనదేశ ప్రజల అభివృద్ధిని, శ్రేయస్సును కోరిన వారమైతే, ఈ సహాయమును వారు యెందుకు యిస్తున్నారో దీనిలో వుండే వారి ఆంతరంగిక ఉద్దేశ్యమును మనము గుర్తించాలి. అమెరికా సహాయమును పొందుటలో గల లాభనష్టములను గురించి దాని

పొందుటలోగల లాభాలు నష్టములను మనం కేంద్రప్రభుత్వమునకు నిష్కర్షగా సలహానివ్వవచ్చు. కాబట్టి, ఈ నాడు మన హిందూదేశములో గల మన ఆర్థికదుస్థితి తొలగుటకు, బీద ప్రజానీకమును అభివృద్ధి పరచుటకు, ఈ అమెరికావారు యిచ్చు technical co-operationతో మనం community projects ను అమలుజరిపి, తోడ్పడగలమని చెప్పి ఈ సహాయమును తీసుకొనే ముందు పూర్తిగా, సమగ్రంగా ఆలోచించాలి. ఈనాడు సామ్రాజ్యవాదులైన అమెరికా సహాయమును పొందిన నార్వే, స్వీడన్ మొదలగు తదితర యూరప్ దేశాలలో దేశాభివృద్ధి వెనుకకు పోయింది.

మన దేశమునుంచి మన విద్యార్థులను విజ్ఞానవంతులైన వారిని యూరప్ దేశములకు పంపి, ఆయా ప్రాజెక్టులను ప్రణాళికలను పరిశోధించి, తగు technical knowledge, experience సంపాదించుటకు తగువసతులు కల్పించి, ప్రోత్సాహపరచవలసియుంది, కాని, మనం ఈనాడు అమెరికావారు ఈ technical aid యిచ్చుటలో గల కుట్రలను, Dulles యొక్క విదేశాంగ విధానములోగల అంతరంగిక భావములను తెలుసుకోవలెను. ఆవిధంగా వారు వారి agents ను మన దేశములో నింపి, వారు యిచ్చుట తిరిగి సామ్రాజ్య తత్వములతో, నిరంకుశ పరిపాలన స్థాపనకు వేయుచున్న కుట్ర అని తేట తెల్లమగుచున్నది. నిన్న మొన్నటి వరకు భారతదేశంలో నిరంకుశ పరిపాలన జరిపి, భారత ప్రజలను పీల్చి పిప్పిచేసినటువంటి బ్రిటీషు సామ్రాజ్యవాదుల హస్తముల నుండి జారిపోయిన ఈ భారతదేశమును తిరిగి అమెరికా హస్తములలో యిరికించుకొనడానికి కుట్రలు, కుతంత్రములను పన్ని, అటువంటి పన్నాగముతో ఈ technical aid అనే పేరుతో అమెరికన్ యేజంట్లను ఈ దేశంలో నింపజేస్తున్నారు. ఈ technical experts మన దేశ పురోభివృద్ధికి యెంతవరకు తోడ్పడగలరు? ప్రస్తుతము ఈనాటి పరిస్థితులనుబట్టి చూస్తే, నిన్న మొన్నటి వరకు అంతర్జాతీయ విధానమును గురించి మాట్లాడుతూ, శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ యీ aid తీసుకొనుటలోగల ప్రమాదమును, వారి ఆర్థిక సహాయమును తీసుకొనేముందు మనకుగల బాధ్యతలను గుర్తించవలసినదని, విమర్శిస్తూ చెప్పారు. మనం కూడ తిరిగి ఆ విషయాన్ని పూర్తిగా ఆలోచించాలి. పాకిస్థాన్

ప్రభుత్వము అమెరికాతో సైనిక సహాయం విషయములో సంధిచేసుకొన్నది. ఈ విధానంలో అమెరికా ప్రజలయొక్క అభిప్రాయమేమిటో మా అందరికి తెలుసు. అమెరికన్ టెక్ని[illegible] తీసుకొన నవసరములేదు. ఎందుకంటే, మనదేశములో మనకు కావలసినంతమంది technicians వున్నారు. వారినే టెక్ని[illegible] అందుచేత ఈ అమెరికన్ technicians ను దిగుమతి చేసుకొని అమెరికన్ డాలర్లను పుచ్చుకొనుటవల్ల మనదేశం ముందుకుపోక, మన అనుకొన్నట్లుగా మన ప్రణాళికలను ప్రాజెక్టులను అమలు జరుపలేము. వుదాహరణ కావాలంటే, ఈనాడు జెకోస్లోవేకియా అటువంటి యూరప్‌దేశాలు ఎంతవరకు పారిశ్రామికంగా అభివృద్ధి చెందినవో మనకు తెలుసు, అటువంటి దేశాలయొక్క technical సహాయమును మనకు కావలసివస్తే ఏలాటి రాజకీయ షరతులు లేకుండా మనం తీసుకోవచ్చు. అలాంటి దానికి యెవ్విధమైన ఆక్షేపణలేదు. ఆక్షేపణవుండకూడదు. మన ప్రధాన మంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూగారు విదేశాంగ విధానమును గురించి ఒక statement చేశారంటే దానిని మనం ఖచ్చితంగా బలపరుస్తున్నాము. ఈ అమెరికన్ స్వారియన్ టెక్నికల్ సహాయం, technical experts మనకు అక్కర్లేదని ఖచ్చితంగా ఈ శాసనసభలో చెప్పుతున్నప్పుడు, మనం ఎట్టి పరిస్థితులలో గూడ ఆ సహాయమును అంగీకరించకూడదని, అందువల్ల మన రాష్ట్రం ముందుకు పోదు, పోజాలదు అని ఖండితముగా నేను చెప్పున్నాను. ఈనాడు నవచైనా అమెరికన్ డాలరు సహాయాన్ని, technical సహాయాన్ని తీసుకొనలేదు కాబట్టే, ఆదేశం ఎంతో బాగుపడింది. వారు వేలాదివేల minor irrigation projects మొదలయినవి ఎన్నో కట్టుకొన్నారు. మరొకవిషయం చాంగ్‌కైషేక్ నిరంకుశపరిపాలన హయాంలో దేశం ఆర్థికంగాను, సాంఘికంగాను, technical development విషయంలోను యెంత తిరోగమించినదో, ఆ ప్రభుత్వము ఏమీ చేయలేకపోయినదన్న విషయం, మనకు విశదంకాగలదు.

అమెరికా సహాయం లేకపోతే, హిందూదేశము పురోభివృద్ధి కాజాలదా? అమెరికన్ సహాయంలేకుండా ప్రజలకు వుపయోగపడాలనే విషయం మీ దృష్టికి తీసుకువస్తున్నాను. మన engineers వుండగా,

విదేశీయ engineers ను తెప్పించుకోవటంలో, ఈనాడు మనం మన engineers కు తీరని అపచారం చేస్తున్నాము. ఈ పరిస్థితులలో దురదృష్టవశాత్తు మనం అమెరికాయొక్క అభిప్రాయాల తీసుకొంటు న్నాము. యూరప్ దేశాలలోనూ, తదితర దేశాలలో గాని, మన దేశం బాగుపడుతున్నదని, మనం ఏవిధంగాను యితర రాజ్యాలకు తీసిపోమని, మనం పేరు ప్రఖ్యాతులు గడించాలి. రాజకీయంగా మనకు ఎన్ని భేదాభిప్రాయాలు, భిన్నదృక్పథాలు వున్నప్పటికి కూడా, ఒక విధంగా మనమంతా, న్యాయమైన విధంగా, యెవ్వరికీ నష్టం లేనివిధంగా, యేకాభిప్రాయానికి వచ్చి, అందరి సహకారంతో పూనుకొన్న ట్లయితే, మనకు మన దేశము అభివృద్ధి చెందటానికి అవకాశం వుంది అమెరికా యిచ్చే డాలరు సహాయాన్ని తీసుకొని, పెద్ద పెద్ద projects కడదామంటే వారి సలహాలను మనం ప్రత్యేకంగా కోరి అమెరకానుండి తీసుకుంటే, దానివల్ల యెంతతీవ్రమైన విషమపరిణామా లకు గురి అవుతామో యెటువంటి ఫలితములు చేకూరగలవో దేశా భివృద్ధికోరి సంపూర్ణమైన హృదయంతో, ఆలోచించాలి.

ఇట్టి పరిస్థితులలో మన engineers కు యెందుకు అవకాశ మును కల్పించరాదు అనినేను అడుగుతున్నాను. అట్టి సావకాశములు యిస్తే, ఎందులోను మన engineers తీసిపోరు అనుటకు దృష్టాంత ముగా, తుంగభద్ర ప్రాజెక్టును కట్టిన మన engineers హిందూ దేశములోనే కాక, యితర దేశాలలోకూడా గౌరవమును పొందు తున్నారు వారిని యితరులు గౌరవిస్తారు. అందుచేత, యీ technical co-operation అనే పేరుతో, ఒకవిధమైన సామ్రాజ్య వాదాన్ని మనదేశంపై పెట్టి, మనపురోభివృద్ధిని అరికట్టి అమెరికా పాలసీవల్ల, విదేశీయుల (అమెరికావారి) గుప్పిటిలో వున్నంతకాలము, మనకు, మనదేశానికికూడా విముక్తిలేదు. విమోచనములేదు. అందు వల్ల ప్రజలు యీ community projects ను యేప్రాంతాలలో పెట్ట మన్నప్పటికీకూడా లాభ లేకుండా పోతుంది.

ఇప్పుడు ఒకవిషయం చెప్తున్నాను. యిప్పుడు K. C. Canal extend చేయటం విషయంలో అమెరికన్ ఏజంట్లు పనిచేస్తున్నారని

యీ పని అంతా అమెరికా చేస్తున్నదనే భావం కల్పిస్తున్నది ఒక ప్రభుత్వ
అభిప్రాయమును వెలిబుచ్చినట్లు కన్పిస్తున్నది. అమెరికా agency
యిక్కడ వున్నారు. ముందుచేయవలసిన పని యిక్కడ [illegible]
కోవచ్చు. అందుకు మనమంతా [illegible] కేంద్రీ
కరించి మనకు యెన్ని భేదాభిప్రాయములు వున్నప్పటికి మనదేశాన్ని
మన సన్నిహితులు యెవరైనా సరే ఒకే రాజకీయ దృక్పథంతో
చూచి, మనలో మనం సహాయం చేసుకుంటూ అమెరికావారి technical
aid ను తిరస్కరించి, తద్వారా మన దేశంలో హిందూదేశస్థుల
వల్లనే పని అయేటట్లు చేయాలి. హిందూదేశము అభివృద్ధి చెంద
నిదే మనం యెన్ని plans వేసినా ప్రయోజనం లేదని ముఖ్యంగా
మన planning శాఖా మంత్రిగారు గుర్తించాలి. అందుచేత
అమెరికా సహాయం తీసుకోవటం యేవిధంగాను క్షేమకరం కాదని మంత్రి
గారు యిట్టి పరిస్థితులలో యీ అసెంబ్లీ సభ్యుల విజ్ఞప్తిని
అనుసరించి, ప్రయత్నం చేస్తారని ఆశిస్తున్నాను. అందుచేత, యీ
ప్రభుత్వం చేయవలసిన దానికోసము, కేంద్రప్రభుత్వం సూచించినట్లుగా
అమెరికా agents అయిన technical agents చేతులలో పెట్టకుండా
యీ ప్రణాళికలను అమలు జరుపుటకుగాను యీ cut motionను బల
పరుస్తున్నాను. కేంద్ర ప్రభుత్వంకూడ సరియైన దృక్పథంతో యీ విష
యమునంతా పరిశీలించి అమెరికా సహాయమును తృణీకరించాలని
చెప్పుతూ, యీ cut motion ను బలపరుస్తూ యింతటితో విరమిస్తు
న్నాను.

---

# APPENDIX.

---

(Vide answer to starred question No. 298 put by Sri K. Krishna Rao at the meeting of the Legislative Assembly held on 17—3—54.)

*(Placed on the table of the House on 17-3-1954)*

* 298 (Answered on 15-3-54.)

Will the Hon'ble the Minister for Planning and Public Health be pleased to state:-

(a) With reference to the programme for 1950-51, for Nellore District in the matter of providing House sites to Harijans why only 2 cases involving an expenditure to the Government of Rs. 1,412-7-1 *were taken up while 40 cases involving an expenditure of Rs. 63,689-8-0 was programmed for:

(b) With reference to the programme for 1951-52, in Nellore district in the matter of providing house sites for Harijans, why only 11 cases involving an expenditure of Rs. 16,153-15-6 were taken up while 30 cases involving an expenditure of Rs. 50,534-0-0 were programmed for?

• *Development Department.*

*Answer.*

(a) All the 40 cases selected in 1950-51 have been investigated. In the two cases of Velagalavagu and Vemuguntapalem taken up lands were acquired for providing house sites and an expenditure of Rs. 1,796-7-1 was incurred. In the 14 cases the proposals to acquire land were dropped. As the connected disposals have been destroyed due to efflux of time the reasons for dropping the proposals are not available. In the remaining 24 cases, the enquiries were pushed

through in 1951-52 to complete them. The delay in disposing of all the remaining cases in 1950-51 is due to elaborate procedure to be observed in acquisition proceedings under the Land Acquisition Act and the unwillingness of the Harijans in some cases to take up the sites selected by the Government.

(b) Out of the 30 cases selected for 1951-52 awards have been passed for 11 cases and lands taken possession of. Out of the remaining 19 cases awards were passed in 3 cases in 1952-53 and in one case in 1953-54. Draft notification and Draft Declaration have been approved in 3 others cases and the notifications are under preparation in 4 cases. Proposals were dropped in respect of the four cases as house sites required for the Harijans were provided otherwise without resorting to acquisition. The reasons in respect of the four other cases are not available as the connected records have been destroyed by efflux of time. The reasons for not disposing of all the 30 cases in 1951-52 are the same as those furnished in answer to (a) above.

---